శ్రీ హయగ్రీవాయ నమః

# పీఠిక



'శ్రీరామకళ్యాణ' మను నీకావ్యము దాదాపు పండ్రెండువత్సరంబులకుఁ బూర్వమే నాచే రచింపఁబడినది. అప్పటికి మా పాఠశాలయందు (గుంటూరు టౌన్ హైస్కూలునందు) సంస్కృతప్రధానోపాధ్యాయులును, అస్మద్గురువరేణ్యులును, మామలును అగు అవధానిశిరోమణి మధ్వ శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు బాలుర భాషాభివృద్ధికై యందు 'మాతృభాషాసమాజం' బొండు నెలకొల్పుటయు నద్దానికిఁ బ్రతివత్సరమును శ్రీరామనవమినాఁడు వార్షికోత్సవము జరుపుటయు నయ్యది సారస్వతప్రధాన మగు సమాజముగాన విద్యాప్రదర్శనమే యం దుచితమగుటంజేసి యవ్వార్షికోత్సవములందు మముబోటి శిష్యపరమాణువులచే నవధానాదులఁ గావింపించుచుఁ దామును గావించుచు సభ్యుల నానందాబ్ధి నోలలాడించుటయు సర్వవిదితమే.

ఈసందర్భముననే యొక్కవత్సరము నేను రామాయణేతివృత్తంబు గల పంచాశ్వాసాత్మక మగు నీకబ్బమును రచించి యస్మత్పాఠశాలాప్రధానాంధ్రోపాధ్యాయులును, ఉభయభాషావిశారదులును, కవులును అగు బ్రహ్మశ్రీ శిష్ట్లా హనుమచ్ఛాస్త్రిగారి యధ్యక్షతక్రింద సభలోఁ జదివి శ్రీరామున కంకిత మొనరించితిని. ఎట్టున్నను బాలుర తొలిపల్కు జనకుల కానందదాయి యగునట్లు నా ప్రాథమికకావ్యము విద్యాజనకులగు నస్మద్గురువరేణ్యుల కానందప్రదమై వారిచే

"గీ. వత్స! నాకడ రామశబ్దంబు మొదలు
పెట్టి దానికి శ్రీ నంటఁబెట్టి తుదకు
మించు కళ్యాణమున నప్పగించి తీవు
నీవ నీవయి మను మింక నిండుకీర్తి."

ఇట్టు లాశీర్వదింపఁజేసి యాంధ్రకాదంబరీ మేఘదూతాది తదితరగ్రంథనిర్మాణంబు నకుఁ బ్రోత్సాహక మయ్యె ననుటకు సందియము లేదు. ఇట్టి మహోపకారులపట్ల

శ్లో. కాశీ కృష్ణకవేః ప్రాంతే । శిష్యత్వం తత్సుబంధుతా
తత్పదాఖండభక్తిశ్చ । భవే న్మే జన్మజన్మని

అని భగవంతుని బ్రార్థించుటకంటె నేఁ జూపు కృతజ్ఞత వేఱొండు లేదు.

మద్గురువర్యులచే బాలుర భాషాభివృద్ధికై నెలకొల్పఁబడిన మాతృభాషాసమాజమునఁ బ్రథమకుసుమంబుగా వెలువడిన యికావ్యము బాలురకుఁ బఠనీయమై యొక్కింత భాషావృద్ధి సమకూర్చినచో గురుసంకల్పంబుఁ గొంతవఱకేని నీడేర్చినవాఁడ నగుదునని సంతసించుచుంటిని.

దానికిఁ దగినట్లు శ్రీ ఆంధ్ర యూనివర్సిటీవా రిద్దానిని 1933-34 సం॥ ఇంటర్మీడియేట్ పరీక్షకుఁ బఠనీయగ్రంథముగా నిర్ణయించి నాకు మఱింత ప్రోత్సాహము గల్గించినందులకు వారి కెంతయుఁ గృతజ్ఞుఁడను. ఇది బాల్యరచితంబును బ్రాథమికకృతియు నగుటంజేసి యిం దేవేని దోషంబు లున్న విడచిపుచ్చి గుణలేశంబులనే గ్రహింపఁ బండితరాజహంసంబులఁ బ్రార్థించుచున్నాను.

ఇట్లు విద్వద్విధేయుఁడు,
గ్రంథకర్త.

## — ఆంధ్రపత్రికాభిప్రాయము. —

—:o:—

శ్రీరామకల్యాణము :— గ్రంథకర్తలు పళ్లె పూర్ణప్రజ్ఞాచార్యులుగారు, సంస్కృతోపాధ్యాయులు, టౌను హైస్కూలు, గుంటూరు. వెల, 0-12-0. ఇది రామాయణకథావిధానము గల యైదాశ్వాసముల గద్యపద్యాత్మక మగు కావ్యము. దశరథుఁడు పుత్రకామేష్టి నొనర్చుట మొదలుకొని శ్రీమద్రామాయణమునందు బాలకాండమునందుఁగల కథాభాగమంతయును సంగ్రహముగ నిందుఁ గూర్పఁబడినది. ప్రస్తుతకాలమునందుఁ బ్రబంధశైలిని గ్రంథరచన సేయు నాంధ్రకవులు చాలనరుదు. అందునను రసవత్తరముగాఁ బ్రాచీనకవుల కేవిషయమునను దీసిపోనట్లు చక్కని శయ్యతో సందర్భోచితములగు శబ్దార్థాలంకారాది పరికరవిన్యాసముతో సందముగాఁ దీర్చి పండితపామరజనోభయగ్రాహ్యముగఁ బ్రబంధములను వ్రాయువారు మిక్కిలి యరుదు. తత్రాపి పరిపూర్ణమగు మేధావిశేషమును వెలయించుచు నిట్టులువ్రాయుట మిక్కిలి కష్టము. పూర్ణప్రజ్ఞాచార్యులవారి పూర్ణప్రజ్ఞత యిందుఁ బ్రతిఘట్టము నందును వెల్లడియగుచున్నది. ఈక్రింద నుద్ధృతము లగు పద్యములు గ్రంథకర్త ప్రదర్శించిన ప్రజ్ఞావిభవమును జాటుఁగల్గియున్నవి. చూడుఁడు. ద్వితీయాశ్వాసమున విశ్వామిత్రుని రామాభ్యర్థనసందర్భము.

చ. అడుగుకొ దవ్వుగాఁ బ్రజలయాశయమెల్ల నెఱింగి యప్పుడ
ప్పుడె యిడు రేపుమాపనక పూర్ణమనోరథులన్ బొనర్చి యే
యిడుమలఁ జెందనీక తనయిష్టతనూజులమాడ్కిఁ జూచు నీ
వొడయఁడ వౌట నీప్రజలయున్నతి గాదె? వివేకసాగరా!

ఉ. అన్వహ మింతకుం బ్రజకు నభ్యుదయానుభవమ్ము, నల్లరా
జన్వతియౌ నదృష్టదశ సాగరమేఖలకున్ దలంప మీ
యన్వయవాసు లెల్లరకు నందుఁ దరించెడి యోగ మొక్కపో
దన్వదుదార! యొక్కపరిఁ ద్వన్నృపతిత్వముచేతఁ గల్గెఁబో.

శా. "రాజ్యంబందుఁ బ్రజానురాగ మలరారన్ నూదిలో దార మ
ట్లీజ్యామండల మేలు నీయెడ నహో "ఏజః పదాన్తా దతి"
ప్రాజ్యవ్యాకరణోక్తి లేనియెడలన్ బాటించి, లోకోక్తియౌ
"రాజ్యాంతే నరకం ధ్రువ"మ్మనుట కర్థంబేమి? భూపాలకా!

---

## — సవరణలు. —

| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 22 | అలంకృతుతె | అలంకృతులె |
| 18 | 18 | విద్యవిద్య | వద్యవిద్య |
| 21 | 5 | జ్ఞాపకము | జ్ఞాపనము |
| ,, | 9 | మెచక్ | మెచ్చక్ |
| ,, | 22 | మునికులాగ్రణి | మునికులోత్తమ |
| 59 | 25 | వినితించుట | వినుతించుట |
| 81 | 8 | ప్రవేశించు | ప్రవేశించె |



శ్రీహయగ్రీవాయ నమః

# శ్రీ రామ కళ్యాణము

## ప్రథమాశ్వాసము



శ్రీమద్భూతనయామనోహరలతా ♦ శ్లిష్టంబు, శ్రేష్ఠంబు, శ్రీ
యోమూలంబు, సలక్షణంబు, పరమా ♦ హ్లాదప్రదం, బక్షివి
శ్రామస్థానము, సర్వతోముఖము, వి ♦ ష్వగ్వ్యాపకం బౌమహో
ద్దామశ్రీరఘురామకల్పతరువున్ ♦ ధ్యానింతు నిష్టాప్తికిన్. 1

శా. రాతిన్ నాతి నొనర్చె నీపదరజో ♦ రాజంబు, నాతిన్, ననున్
రాతిన్ జేయునొ యేమొ! భీతియగుఁ జే ♦ రన్ రాను నీకున్ నమో
వ్రాతంబంచుఁ జలోక్తిగా ధవుఁడు పై ♦ పై రాఁ బ్రసంగించు మా
సీతన్ సద్గుణజాత నిస్తులయశ ♦ స్స్ఫీతన్ మదిన్ గొల్చెదన్. 2

మ. కొలువుంగూటమునందుఁ బల్కుఁ జెలితోఁ ♦ గూర్చుండి తత్త్వంబు మౌ
నులకున్ బోధయొనర్చువేళ సతిమే ♦ నున్ దాఁకి నెమ్మేనొగిన్
బులకింపన్ గనుమూసి భక్తి మిషమౌ ♦ నుల్ తన్ను నేమందురో
తిలకింపన్ గడగంటఁ జూచువిధి సం ♦ ధించున్ జిరాయుష్యముల్. 3

మ. తననాథుం డవివేకి యాతఁడని వ ♦ క్త్రింబందునన్ వ్రీయఁగాఁ
గని పంకంబున కెట్టికేల కతనిన్ ♦ గావించి విద్వద్వరే
ణ్యుని స్త్రీబుద్ధి చతుర్గుణం బనెడు లో ♦ కోక్తిన్ ధరన్ నిల్పు మా
జననిన్ గొల్చెద నాత్మలో మధురవా ♦ చాసారదన్ శారదన్. 4

మ. వరుఁగాఁ గోరి నినున్ దపించిన ననున్ ♦ వర్జించి ముత్త్రోవది
మ్మరి నోర్తున్ దలపై ధరించితివి పా ♦ మ్మా! కోరి తా మామకూఁ
తురు రాఁగాఁ గని, వావి కాదనుమహా ♦ తుమ్మల్ మీర లం చల్గు భూ
ధరపుత్రిన్ గయిదండ నేలుకొను భూ ♦ తస్వామి మమ్మోముతన్. 5

గీ. సత్కవీంద్రుండ వుభయభా ♦ షావిదుఁడవు, శబ్దశాస్త్రవిజ్ఞుండవు ♦ సరసమతివి
నిరుపమానంబు నీశక్తి ♦ నీకసాధ్య,మున్నె వ్రాయుము నీకృతి ♦ వన్నెఁగాంచు.

క. అది యేమొకాని పూర్వులు, వదలక రామాయణంబె ♦ వ్రాసిరి ప్రథమం
బది యాదికావ్యమనియో, మది రాముని చరితగాన ♦ మాన్యం బనియో. 25

క. నా కింపు నింపుఁ బూర్వుల, పోకడ లట్లొక్క కావ్య ♦ మున్ వ్రాయఁగ దే
నాకధునీపద్మవనీ, ప్రాకటమాధ్వీకపాక ♦ పరిపంధిగతిన్. 26

వ. అని వచించుటయు నేనును రామాయణాంతర్గతం బగు శ్రీరామకల్యాణంబు వ్రాయఁ దలంచుకొన్నవాఁడ నగుటం జేసి తదీయవచనమ్ములు కర్ణానందమ్ములగుడు

క. వైద్యుండు రోగియును నన,వద్యంబుగఁ బాలె గోరు ♦ వైఖరి కాఁగన్
సద్యోగతి నీకలనకు, నుద్యోగించితిని రాముఁ ♦ డున్నాఁడనుచున్. 28

క. వేసవి సెలవ లొసంగిన, మాసద్వయ మేగ కెందు ♦ మన్నన మూఁడా
శ్వాసముల వ్రాసి రెండా,శ్వాసము లొకమాసమునకు ♦ వ్రాయంగంటిన్. 29

క. తనయామణిఁ గవితామణి, ననురూపుండైన వాని ♦ కర్పింపక యు
న్నను బెక్కుమాటలేలా ? జనకునకున్ గవివరునకు ♦ సంతసమున్నే ? 30

క. అనితలఁచి కవిత యనఁగా, వనజాలయ, దాని కెందు ♦ వనజాక్షుండే
యనురూపుఁ డైనవల్లభుఁ,డని రామున కిచ్చువేడ్క ♦ నతిశయమగుడున్. 31

వ. ఆరామచంద్రునకు నా వ్రాయుకృతి నీయఁ గృతనిశ్చయుండనై యతనిం
గూర్చి షష్ఠ్యంతమ్ములఁ దొలుదొల్త వాక్రుచ్చెద— 32

బా - కాం

క. శిక్షిత తాటకునకు సుర, రక్షాత్తవతారునకు వి ♦ రాట్పురుషునకున్
త్ర్యక్షశరాసనభంజన, దక్షునకున్ మహీసుతేష్ట ♦ తమవక్షునకున్. 33

అ - కాం

క. లీలాకృతజనకాజ్ఞా, పాలునకున్ గృతనిషాద ♦ పాలస్నేహ
శ్రీలునకు లోకనుతగుణ, జాలునకున్ రామచంద్ర ♦ జనపాలునకున్. 34

అర - కాం

క. దానవమత్తకరీడ్పం, చాననునకు లక్ష్మణాగ్ర ♦ జన్మున కజన
స్థానీకృతనిఖిలజన,స్థానునకున్ మౌనిహృదయ ♦ సంస్థానునకున్. 35

కి - కాం

క. వేలాతిక్రమవిక్రమ, శాలికి నౌదార్యధైర్య ♦ శాలికిఁ దేజో
శాలికి నేకాశుగహత,వాలికి గుణనిధికి సత్య ♦ వారాంనిధికిన్. 36

సుం - కాం

క. ధరణీతనయాన్వేషణ, పరహృదయగతాఽఽగతాతి ♦ బలతనయసమా
దరపూర్వపారితోషిక, పరిపూర్ణకృపాప్రదత్త ♦ పరిరంభునకున్. 37

యు - కాం

క. కదనగతానూకృతదశ,వదనునకు గృహీతధర్మ ♦ పత్నీకునకున్
సదయునకున్ విమలగుణాఽఽస్పదునకు సాకేతలబ్ధ ♦ సామ్రాజ్యునకున్. 38

ఉ - కాం

క. లోకనుతిఁ గన్న సతితోఁ, బ్రకటగుణు లైన సుతులు ♦ పరివేష్టింపన్
వీఁకం దమ్ములు గొల్వఁగ, సాకేతం బేలు రామ ♦ జనపాలునకున్. 39

వ. అంకితముగా నా యొనర్పం బూనిన శ్రీరామకళ్యాణంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన :—

## కథాప్రారంభము

---

సీ. మందమందానిలా ♦ స్పందితాంబుజబృంద, బందీవినిర్యదిం ♦ దిందిరంబు
లీలాసదనబద్ధ ♦ జాలాంతరావిద్ధ, కాలాగరూత్తాల ♦ లాలితంబు
జాంబూనదాదభ్ర ♦ జంబాలకలితాభ్ర, చుంబచ్ఛిరోగృహ ♦ డంబరంబు
శృంగారవనచర ♦ ద్భృంగాంగనాగీత, సంగీతభంగీత ♦ రంగితంబు
గీ. నగుచు రెండవత్రిదశాల ♦ యంబనంగ, మంజులతరాప్సరోగణ ♦ మాన్యమగుచు
వన్నెలం జిన్నెలుం గల్గి ♦ చెన్ను మీఱు, దేశములయందుఁ గోసల ♦ దేశ మొకటి.
శా. రాశీభూతమనుష్యలోకసుచరి ♦ త్రంబంచు, స్వర్గేందిరాఽఽ
దేశంబంచు, మహాత్ములౌ సుకవులు ♦ ప్రేక్షింపఁగా నొప్పి, వా
రాశిప్రావృతకాశ్యపీతలములోఁ ♦ బ్రాశస్త్యముం గాంచి, యా
దేశం బొప్పు, ధరిత్రికిన్ మణిఘృణీ ♦ దీవ్యత్కిరీటం బనన్. 2
గీ. ప్రజలు తత్పురఁబ్రాకార ♦ పటిమఁ గాంచి, శత్రువిశ్వభద్యమిదియని ♦ సంస్తుతింపఁ
గోసలంబుల కల మణి ♦ భూసమాఢ్య, రాజిలు నయోధ్య యనవొక్క ♦ రాజధాని,

గీ. నాల్గుమోములులేనట్టి ♦ నలినభవులు, నొసట నయనంబులేని మ ♦ నోజహరులు
వేదలలు లేకగ్రాలుశ్రీ ♦ శ్రీదరాధి,నాథు లప్పూరి భూసుర ♦ నాథు లరయ. 4

సీ. అలవాక్కు తడఁబడ ♦ నతిఘనుండైమించు, విధి యెంత తా సాంగ ♦ వేదవేత్త
పాటింపఁగా నొక్క ♦ పాదమేనియు రాని, పన్నగాధిపుఁ డెంత ♦ పండితుండు
కనపడ్డవస్తువె ♦ ల్లను నారగించు వై,శ్వానరుం డెంత యా ♦ చాగపరుఁడు
కరికి మొగము వాఁచి ♦ నరునెక్కుచుం గర్వ,పడు కుబేరుం డెంత ♦ భాగ్యశాలి
గీ. యనుచు లక్ష్యంబు సేయక ♦ యాగమైక, పాండితీశౌచసౌభాగ్య ♦ భాగ్యసరణి
మహితులై విప్రు లప్రీతి ♦ మానలగుచుఁ, దనరుచుండెద రారాజ ♦ ధానియందు.

ఆ. సంగరాంగణమున ♦ శత్రుసేనలు రేఁగి, వేగిరింప ముందు ♦ వెనుక లరయ
బాహులేయుఁడొక్క ♦ బలశాలియా యంచుఁ,గేలిసేతు రందుఁ ♦ గ్రాలున్నృపులు.

ఉ. చెట్టులు కొంద ఱాముదపుఁ ♦ జెట్టునె, చెట్టులు లేనిచోటఁ, బెం
జెట్టనినట్లు, భార్గవుని ♦ జెల్లఁనె బాహుబలాఢ్యుఁడన్న మా
పుట్టకమున్న, రావలయుఁ ♦ బో యిఁక నాజమదగ్నిసూతి మా
పట్టణ మప్డుగా! యనుచుఁ ♦ బల్కెద రందలిరాజనందనుల్. 7

చ. గుణముల నెప్డు లాగదరొ ? ♦ కోలల నెప్పుడు సంధిసేతురో ?
ధణధణమంచుఁ గ్రిందఁబడు ♦ తాళఫలప్రతిమారిమండలీ
మణియుతమస్తకంబు లవి ♦ మాత్రము గన్పడు ! వారి బాణనై
పుణి రిపుకోటి కెప్డు దల ♦ పోసిన గుండెకు గాలమై తగున్. 8

ఉ. వారల శక్తికిం దగిన ♦ వైఖరి శాంతము, వారి రూపపుం
దీరున కట్టు లవ్యహద ♦ తీవిముఖత్వము, వారి విద్యకుం
గోరినయంత నీతి, సమ ♦ కూరనిచోఁ బలుమాట లేల య
వ్వారలవైభవంబులకుఁ ♦ బట్టఁగఁ బగ్గము లుండునే ధరన్ ? 9

చ. సరిదధినాథునందుఁ గల ♦ సర్వమణుల్ ఫణిహాళిహాళిభా
సురమణిపంక్తి చూపఱుల ♦ చూపునకుం గనిపించుచుండుఁ ద
త్పురిఁగల వైశ్యపుంగవుల ♦ భూరిగృహాంగణసీమయంద, యా
సిరి యెపుడున్నఁ గావలదె ♦ చేతులకున్ బగలేనిఁ గాగడాల్! 10

చ. ఘనులెదురైన వారిపద ♦ కంజయుగంబు శిరంబు సోఁకభ
క్తిని నతిసేయకుండు ఘన ♦ కిల్బిషపాత్రులు, 'నో' యనంగ 'నా ?'

యను నది నాఁకు రా దనుని ♦ రత్నకరుత్థులు లేరు భూదుర్గిలం
దనుపమ మద్ది కాలమహి ♦ మాతిశయంబో, తదీయపుణ్యమో. 11

సీ. తిండికై యిల్లిల్లు ♦ దేవులాడు కపాల, పాణులు కనకాద్రి ♦ పాణులైరి
మూఁడడుగుల స్థలం ♦ బునకేని గతిలేని, మస్కరులెల్ల శ్రీ ♦ మంతులైరి
జీవనార్థము వచ్చి ♦ చెడి క్లేశపడినట్టి, ఘనులు జీవనదాన ♦ గణ్యులైరి
తన యప్పుచే మునిం ♦ గిన దీనులెల్లరు, నసమానదివ్యర ♦ త్నాఢ్యులైరి

గీ. వసుమతియనంగ ధనధాన్య ♦ వైభవముల, ధరణియెల్లను సార్థాభి ♦ ధానయయ్యె
బాగరూకత ధర దున్ని ♦ సస్యములను, నచటి భూదుర్గిలు పండించు ♦ నవసరమున.

క. తన వాయువేగమును మించిన వేగం బెపుడుఁ దమకుఁ ♦ జెలువారంగాఁ
దనరారుఁ దురగ నామం,బును సార్థకమనఁగ గుఱ్ఱ ♦ ములు తత్పురిలోన. 13

గీ. ఏడుగుఱ్ఱంబులను గట్టి ♦ యెల్లనింగిఁ, దిరుగుటకు సూర్యునకు నొక్క ♦ దినముపట్టు
నచటి వాహన మొకఁడున్న ♦ నంతయేల, త్రిజగ మొకపూఁటలోపలఁ ♦ దిరిగిరాఁడె?

చ. కనుఁగొన నందుఁ గల్గు వెల ♦ కాంతలగుబ్బల కాఁగలేక పో
యిన యపకీర్తి యంతయును మె ♦ యిల్కొన నట్లు వినీలమూర్తులై
చనియెనుగాని లేనియెడ ♦ శక్రునిదంతికి నప్పురంబునం
దనరు మదేభసంతతికి ♦ ధారుణి భేదము కానవచ్చునే? 15

చ. తమ కుచగౌరవంబుఁ గని ♦ తాళిమిమాలి మహాద్రు లట్లుగా
భ్రమపడి, వాసవుండు తన ♦ వజ్రముచే నిఁకఁ గొట్టునంచు డెం
దమునఁ దలంచి ధాత్రిఁ దలఁ ♦ దాఁచఁగవచ్చినయట్టి యప్సర
స్సముదయమా యనంగ ఘన ♦ చందనగంధులు పొల్తు రప్పురిన్. 16

ఆ. చెఱకుఁబానకంబు ♦ చేఁదు చేఁ దనిపించు, నప్పురమునఁ బాలు ♦ నట్టి నీరు
తిరిప మేల యచటి ♦ తీర్థంబుచే భుక్తి, నలుపవచ్చు బీద ♦ సాదలెల్ల. 17

సీ. తరమౌనె పొగడఁ ద ♦ త్పురిలోని సంగీత,ములసొంపు సౌధమం ♦ డలులయింద్ర
కనితీరవలె నందుఁ ♦ గల మహోన్నతమహీ,ధరములబారు, త ♦ త్తరులతీరు
అనుభవింపఁగవలె ♦ నందలి మందాని,లంబులతీవి వ ♦ ల్లరులతావి
తల లూఁచి మెచ్చఁగా ♦ వలె నందు నుద్యాన,ములరంగు ఫలపుష్ప ♦ ములబెడంగు

గీ. పెక్కుమాటల ఫలమేమి ♦ యొక్కమాట, దానిఁ గనుగొనఁగాఁ బోల్ప ♦ నేని యవని
నిక్కడ "జననీ చ జన్మభూ ♦ మిశ్చ" యనెడు, సూక్తిఁ దలపోయు నేయొట్టి ♦ సుంధరుఁడును.

గీ. నగరి నెటువైపుచూచిన ♦ నవ్యరత్న, కుట్టిమంబులె యందుఁ గ ♦ న్పట్టుకతన
నేకదేశానుమతిచేత ♦ నెల్లమహికి, రత్నగర్భాఖ్య యపుడు సా ♦ ర్థకమయుండ్రు.

సీ. భవననిర్మితహరి ♦ ప్రతిమావలోకన, ధావదాశాంతదం ♦ తావళమ్ము
ప్రాసాదరచితాబ్జ ♦ కాసారమకరంద, పానభ్రమాగత ♦ బంభరమ్ము
చంద్రశాలాంతర ♦ స్థగితదైత్యేంద్రచి, త్రాలోకసంభ్రమ ♦ దమరగణము
గారుడమణిగేహ ♦ ఖచితతార్క్ష్యాకార, భీతభీతానేక ♦ విషధరంబు

గీ. నగుచుఁ గన్నులపండువై ♦ యబ్జభవుఁడు, భరతదేశాభిమానంబు ♦ బయలుపడఁగఁ
జెసెనో యన రాజిల్లు ♦ పిరులకెల్ల, దాఁపురం బగునాయయో ♦ ధ్యాపురంబు.

గీ. ఆపురం బేలు దశరథుం ♦ డనఁగ నొక్కఁ, డద్వితీయస్వబాహుబ ♦ లద్వితీయుఁ
డగుచు సురలెల్ల వేనోళ్ళఁ ♦ బొగడుచుండ, నింద్రుఁ డమరావతీపురి ♦ నేలుపగిది.

సీ. దీనజనావన ♦ దీక్షామహావ్రత, కార్యాచరణబద్ధ ♦ కంకణుండు
నిరుపమబలసము ♦ న్నిద్రభుజాదండ, దండితశాత్రవ ♦ మండలుండు
దానక్రియాగుణ ♦ ధారేయతాదూర, దూరీకృతామర ♦ భూరుహుండు
చతురంబుధిపరీత ♦ సర్వసర్వంసహా, ముక్తాతపత్రితా ♦ మూల్యయశుఁడు

గీ. కలఁడె యిటువంటిరాజని ♦ ఘనులు మెచ్చఁ, బొలుచునాతండు సముదగ్ర ♦ భూరిసత్వ
శోభితుండయి తన కీడు ♦ జోడులేక, సకలజనమానసాబ్జభా ♦ స్కరునిపగిది. 22

మ. జననాథాగ్రణి, దానముల్ సలుపు ని ♦ చ్చం జేసి, వర్తించుచోఁ
దనకైలాసమహీధరం బెచటఁ దా ♦ దానంబుఁ గావించునో
యని శంభుండు, సువర్ణభూధరముపై ♦ నాదిత్యులున్ రేవగల్
గమలన్ మాయక చూచుచుండ్రు పొగడం ♦ గా రాదె తద్దానముల్. 23

ఆ. అడిగినంతకంటె ♦ నధికమిచ్చుటదప్ప, నాస్తి యనుట కతని ♦ నాల్కరాదు
అప్పు డిప్పుడట్టు ♦ లర్థార్థు లున్న బం, గారుతోడ నిండ్లు ♦ గట్టరాదె! 24

సీ. ఇనుఁడౌనె సరకులఁ ♦ గబళించి తజ్జీవనంబులఁ దీయు సం ♦ తాపకారి
రాజౌనె యన్యభా ♦ ర్యలఁ బద్మముల రేలఁ, జేనంటి యంటుచే ♦ నెడుకళంకి
ఘనుఁడౌనె సన్మార్గ ♦ గతుల కడ్డమువచ్చి, వెస దుర్దినంబుఁగా ♦ వించుకలుషి
ఈశానుఁడౌనె యూ ♦ హింప నర్ధాంగికృ, తార్యుఁడైనట్టి ము ♦ శోకిరాతుఁ

గీ. డనుచుఁ బ్రజలెల్లఁ దనుఁ గూర్మి ♦ నభినుతింప, ధైర్యగాంభీర్యసద్గుణ ♦ ధుర్యుఁ డగుచుఁ
వెలుఁగు వైభవగుణతిర ♦ స్కృతనిలింప, పాలకుం డగునానర ♦ పాలకుండు. 25

చ. దయయును, శాంతమున్ దనకుఁ ♦ దాలిమిచుట్టములై భజింప, నె
ల్లయెడఁ, బ్రజానురాగము నె ♦ లంగ, ననంగసముం డతండు దు
ర్జయుఁడయి యేలుచుండఁగ, న ♦ రాతి యొకండును లేఁడు, తన్ను నెం
తయు నిరసించుటం గనలి ♦ తారు నధర్మముదప్ప ధాత్రిలోన్. 26

గీ. ఆనరేంద్రుభుజాప్రతా ♦ పార్కుఁడెలమి, రేవగళ్ళని యన కొక్క ♦ రీతి వెలుఁగ
నళినసంమీలనోన్మీల ♦ నములఁబట్టి, దెలియుదురు జను లందు రా ♦ త్రిందివముల.

చ. అతఁడు చతుస్సముద్రపరి ♦ ఖాంచితమౌ ధర నేలుచుండఁగా
సుతులను గోలుపోయి కడు ♦ శోకముఁ జెందెడుతల్లిదండ్రులున్
మతి చెడి వర్ణహీనులయి ♦ మద్యము మాంసము నారగించు దు
ష్కృతులును గానరారు పరి ♦ కింపఁగ మందునకేని నందునన్. 28

గీ. తనదుపూర్వుల మఱపించి♦ధరణివిభుఁడు, ధర్మముగఁ బాలనము సేయు♦తరుణమందు
శూలియొక్కఁడు దప్పఁ గ♦పాలపాణి, కానరాఁడయ్యె నొకఁడేనిఁ ♦ గాంతుమనిన.

సీ. జక్కవల్ శారద ♦ చంద్రచంద్రాతపాం, బురములా యని కల ♦ వరపడంగఁ
బాలసంద్రము పొంగి ♦ మైఁబడునా యంచు, వేల్పులు దీనులై ♦ వెఱఁగు నెందఁ
బగలె చంద్రుఁడు పుట్టె ♦ నగు నసద్ధం బని, యరిమనఃపద్మమ్ము ♦ లడలుకోనఁగ
భూతధాత్రిఁ బవిత్ర ♦ ముగఁ జేయవచ్చు మి, న్నెఅని జనులెల్ల ♦ నెన్నుచుండఁ

గీ. గొండలను నెల్లెడల వెండి ♦ కొండలట్లు, కరుల నెల్లెడలను సుర ♦ కరులమాడ్కి
ఛత్రముల నెల్లెడల సిత♦చ్ఛత్రములుగఁ, జేసి యానృపు సత్కీర్తి♦ చెలువుమీఱు.

గీ. జనులు తనయానతిని శిర ♦ సావహించి, చెప్పినది చెప్పినట్లుగాఁ ♦ జేయుచుండఁ
బట్టినది యెల్లఁ బైఁడిగాఁ♦బరఁగ నేపుఁ, జూపు నతఁడంగనా పుష్ప♦చాపుఁడనఁగ.

వ. ఇట్లనన్యజనసామాన్యంబు లగుసద్గుణంబుల కాలవాలమగుచు, ధర్మోత్త
రంబుగాఁ బ్రజాపాలనము సేయు నన్నరేశ్వరునకు. 32

గీ. జననుతచరిత్ర కౌసల్య ♦ యన నొకర్తు, మితహితాలాప యోర్తుసు ♦ మిత్రయనఁగ
నాయకప్రేమపూర్ణ కై ♦ కేయి యొకతె, జలజనేత్రలు మువురు ♦ వెలయుచుండ్రి.

ఉ. వారలరూపసౌష్ఠవము ♦ వారివచోవిభవంబు చెప్పినం
దీరునె పూర్ణిమాతుహిన ♦ దీధితి వారిముఖంబుఁ జూచినన్
జారును, వారివాగమృత ♦ సారముఁ గ్రోలిన, నల్లశారికా
వారము వాఱునన్న సరి ♦ వచ్చునె తమ్ములు నాకుకమ్ములున్ ? 34

గీ. బలము గలిగినచతురంగ♦బలముతోడ, వసుమతి జయించి యేలు న♦వ్వసుమతీశు
వశము గావించుకొనెఁ జేరి తు♦వశునిఁజేసి,యాలతాంగుల యొకకటా♦క్షాంచలంబు

చ. అల కుటిలత్వముం, గఠిన♦ తాతిశయంబు, విలోలభావ మా
జలజనిభేక్షణాకచకు♦ చంబును, నక్షుల నాశ్రయించి భా
సిలి, నరనాథ! మెప్పువడ♦ నెక్ వివరింపఁగ నేల, దుర్గుణం
బులు నయితమ్ము; నట్లు యగుఁ♦ బో! మహదాశ్రియ మెట్టివారికిన్. 36

చ. తెలియక నిర్దయన్ నమలి♦ తిందు, రిసీ జనులంచు, దాడిమీ
ఫలములలోని బీజములు♦ బ్రిహ్మనుగూర్చి తపించి, వృక్షశా
ఖలఁ దలక్రిందులై ఫలము♦ గా నలకాంతలదంతరాజి గా
వలయును, లేనిచో రదన♦ పంక్తుల కంతటి తేజ మబ్బునే. 37

గీ. వదనమంభోరుహంబను♦ వాంఛఁజేసి, యందు మకరందమానఁగా♦ నగు నటంచు
ముసరుకొనియున్న తుమ్మెద♦యూఁకయనఁగ,ముంగురులురంగుమీఱున♦య్యంగనలకు

గీ. అన్నివిధములఁ జతురాస్యుఁ♦ డాతితేతి,జనులచే వ్రేలఁజూపించు♦ కొననియట్టు
లాలతాంగుల, సృష్టిచే♦ యంగఁబోలు,నంబుజాంబక మోహనా♦స్త్రంబులట్లు.

ఉ. చిత్రము వార లాకృతివి♦ శేషముచే, సిరిచే, నిరస్తులో
కత్రియలయ్యు, గర్వము మొ♦గంబు నెఱుంగరు, మేలు, వారి సౌ
శాత్రిత్రము మున్నగాఁగలుగు♦ భవ్యగుణంబులు "యత్రి చాకృతి
స్తత్రి గుణా" యటంటకు ని♦దర్శనతుల్యములై, వెలింగెడున్. 40

సీ. పతిభక్తిలో ముందు♦ పరమావధిగ వారిఁ, జెప్పిరే యన్యలఁ♦ జెప్పవలయు
లాలిత్యమున కెందు♦ లక్ష్యంబుగా వారిఁ,జూపిరే యన్యలఁ♦ జూపవలయు
గ్రాఁబోఁడులకు శిరో♦భూషలుగా వారిఁ, దెలిపిరే యన్యలఁ♦ దెలుపవలయు
ధర్మవర్తనల కా♦దర్శంబుగా వారి,నెన్నిరే యన్యల♦ నెన్నవలయు
గీ. వనము వేశోక్ష్మఁ దమఁ గొని♦యాడి యందుఁ,గాఁపురంబుండు చందన♦గంధు లెల్లఁ
దమను నడతల కెంతొ సం♦తసముఁ జెందఁ, బొలుచుచుందురు, మిగుల న♦వ్వూ
[వుఁబోండ్లు. 41

చ. నలుగురినోళ్ళలోనఁబడి♦ నానె నటన్న దోసం, గనంగునిక్
వలనె నటన్నదుర్యశము♦ వాపికొనన్ సమకట్టి, ధాత్రిలో
పల, జనవంటుఁగాంచు నల♦ భారతులా! రతులా! యనంగ, న
చ్చెలులవహోవిలాసములు♦ చెప్పక చెప్పెడు నప్పురంబునన్. 42

వ॥ ఇట్లసమానసకలసౌభాగ్యలసమానలై యక్కుసుమగంధు, లమందానంద
కందళితహృదయారవిందలై సేవింపుచుండఁ, బెక్కేండ్లు సంతోషసాగరంబున నోల
లాడుచు నమ్మహీకాంతుం డేకాంతంబున నొక్కనాఁడు 43

సీ. పుత్త్రుఁ డొకఁడైనఁ ♦ బుట్టకయున్నచోఁ, బున్నామనరకంబు ♦ పోవుటెట్లు?
నందనుఁ డుదయంబు ♦ నొందకయున్నచోఁ, గుల మెల్లకాలంబు ♦ నిలుచుటెట్లు?
సూనునాననమును ♦ జూడకయున్నచో, నుత్తమలోకంబు ♦ నొందుటెట్లు?
ఆత్మజుఁ గాంచుభా ♦ గ్యంబు లేకున్నచోఁ, బరిణయవిధికి సా ♦ ఫల్యమెట్లు?

గీ. పట్టి యనువాఁడొకండు చూ ♦ పట్టకున్న, వార్ధకంబున సౌఖ్యంబు ♦ వరలుటెట్లు
సౌఖ్యమున్నె? యపుత్త్రుండు ♦ చక్రవర్తి,యౌనుగా కాతనికిఁ దాత♦యౌనుగాక.

గీ. వెలయు సంసార మనువిష♦వృక్షమునకు,సూనుఁడేగద యమృతోప♦మానమైన
ఫలమనుచుఁ బెద్ద పెద్దలు♦పలుకుచుండ్రు, కొడుకు లేకున్న సంసార♦గోష్ఠి యేల?

చ. జననుతకీర్తులైనతను ♦ జన్మలఁ గాంచనియట్టివారి యా
వనము వనమ్మె, తండ్రులకు ♦ వన్నెయు వాసియుఁ గూర్చు వంశవ
ర్ధను లగుసూనులం దొడలఁ ♦ దాల్పనివారివిభూతి భూతి, నం
దనమున కేఁగినం, దుది న ♦ నందనుఁ డెందును సౌఖ్య మందునే? 46

చ. ఒడయఁడనైన నేమి, ధన ♦ ముండిన నేమి, ప్రజానురాగముం
బడసిన నేమి, రూపుగల ♦ భామిను లుండిన నేమి, యక్కటా!
కొడుకులచేతఁ దండ్రి యను ♦ కొంటకు నోఁచనినాడుజీవితం
బడవిని గాచు వెన్నెలయె ♦ యయ్యెఁగదా, యనుమాన మేటికిన్. 47

ఉ. వెక్కసమై కరంబు తల ♦ వెండ్రుక లెన్నియొ యన్నివత్సరా
లిక్కడకే గతించె, జర ♦ యేర్పడె, మృత్యువు నెప్పుడెప్పుడా
స్రుక్కఁగఁ జేయుటం చెదురు ♦ సూచుచునున్నది, యెందు కింక నా
కెక్కడఁ బుత్త్రసంజనన ♦ మెక్కడ సౌఖ్యముఁ గాంచు టక్కటా! 48

గీ. వత్సరముమీఁద నింకొక్క♦వత్సరంబు, వచ్చి నానాఁట నాదుపైఁ ♦ బడుకొలంది
నడుగునం బడి క్షీణించె ♦ నాత్మజాశ, సైతము, నిదాఘునిమ్నగా ♦ సలిలమట్లు.

గీ. అని విచారసముద్రంబు ♦ నందు మునిఁగి,యున్న యాకోసలాధీశు ♦ నుత్తరింప
నావపగిది వసిష్ఠుఁ డా ♦ తావుఁజేరఁ, దరలివచ్చెను, దలవని ♦ తలఁపుగాఁగ. 50

చ. దవు దవులఁ న్నృపాలుఁడు ము ♦ దంబున దండముఁ బెట్టఁగా "సుఖీ
భవ" యని దీవెనల్ సలిపి ♦ భాసురరత్నవినూతనప్రభా
ప్రవిమలహేమపీఠమునఁ ♦ బార్థివుమ్రోల వసించి, యామునిఁ
బ్రవరుఁడు సేయుమా మధుర ♦ వాక్యములన్, ముదమొప్ప నిట్లనున్. 51

గీ. భద్రమే నీకు. నీరాణి ♦ వాసమునకుఁ, బదిలమే నీదుపుత్రులకు, ♦ బందుగులకుఁ
గుశలమే యెల్లరకుఁ బూస ♦ గ్రుచ్చినట్లు, పలికె నాసంశయంబును ♦ బాపుమయ్య!

చ. అనుపమదివ్యతేజ! భవ ♦ దాననమున్ గన నేదొ చింతలోఁ
మునిఁగినయట్టులౌ, నయన ♦ ముల్ తిలకించిన నేమొ, దీర్ఘచిం
తన మొనరించి వాడిన వి ♦ తమ్మునఁ దోఁచెడు, హేతు వేమియో
వినఁదగు నేని నాకు విని ♦ పించి మదిం గలచింతఁ దీర్పుమా. 53

చ. ధరణి జనించి నీవు వసు ♦ ధారమణా! శతమా సహస్రమా
యఱువదివేల వత్సరము ♦ లాయె రమారమి, నాఁటినుండి యీ
వఱకు శుభంబులైనను శు ♦ భంబును బొందుట తప్ప దుఃఖమే
యెఱుఁగవు, వంత యింత గొన ♦ నేటికి నేఁటికి నాకుఁ దెల్పుమా. 54

శా. పాపంబుల్ పొనరించితో? వసుమతిం ♦ బాలింప లేవైతొ? దు
ర్వ్యాపారంబులఁ జిక్కితో? నృపులు క ♦ ప్పం బీయరో? యీ మన
స్తాపం బేటికి, నీయెడం బ్రజల కి ♦ ష్టం బెందు క్షీణించెనో?
డాపంబూనక తెల్పు నేను వెఱవా ♦ డం గాను భూపాలకా! 55

క. అని యీగతి గంభీరస్వనమునఁ దన విధము వాని ♦ చందుర్యం డడుగన్
జనపతి సర్వము విట్టుని, వినయముఁ దళుకొత్త విన్న ♦ వింపఁగడంగెన్. 56

గీ. కులగురుఁడవైన నీవొక్క ♦ వలను వంశమూల మగుభాస్కరుం డొక్క ♦ మూలఁ జేరి
యనుదినంబును మాసేమ ♦ మరయుచుండ, నశుభముల కింక మముఁ జూడ ♦ నలవియగునె?

చ. మునికులసార్వభౌమ! మును ♦ ముందుగ సర్వము దూరదృష్టితోఁ
గనుగొని నాఁడె యేడుగడ ♦ గా నినుఁ జూపి దివంబుఁ జేర మా
జనకుఁడు; తండ్రియున్ గురుఁడు ♦ సర్వము నీవయి యుండ నింక నీ
వినఁదగనట్టి మాటలు వి ♦ వేకధనా! మఱి మాకుఁ గల్గునే. 58

గీ. ఇదివఱకె యోగదృష్టితో ♦ నెఱుఁగు మీరు, నేను సెప్పుట పునరుక్తి ♦ యైన నేమి
చెప్పెదను దుఃఖహేతువు ♦ చిత్తగింపుఁ, డయ్య గురువాక్యమెం దలం ♦ ఘ్యంబుగాదె.

ఉ. తామరసాప్తుఁడాదిగ మ♦ దన్వయ మన్వహవృద్ధితోడుతన్
దామరతంపరై యజుని♦ దాఁకఁ జెలంగి, మహాత్మ! నేఁడు నా
నామముతోడ నంత మగు♦ నా యనుచింత నిరంతరమ్ము న
న్నేమహి నాఁటినాఁటి కల♦యించుచున్నది తాపసోత్తమా! 60

సీ. కులదీపకుండైన♦ కొమరుండు లేకున్నఁ, గొంపగా దది ముండ్ల♦ కంపగాని
సుగుణాంబురాశియౌ♦ సూనుండు లేకున్న, గృహము గా దది శని♦ గ్రహముగాని
సంతసమిడు నాత్మ♦ జాతుండు లేకున్న, నిల్లు గా దది చిత్త♦ జల్లుగాని
సుందరాకారుఁడౌ♦ సుతుఁడు లేకున్న నాలయము గా దది మహా♦ లయముగాని
గీ. పితరులఋణంబుదీర్చు స♦త్సుతుఁడు లేని,వాని జన్మంబు జన్మమే♦వసుధయందుఁ
దల్లి కత్యంతకష్టమ్ము♦ ధరకు బలువు,గాక ఫలమున్న దే మౌని♦ లోకవంద్య! 61

ఉ. కాయలు గాసెఁ జూడు, తల♦ కాయ కిరీటముఁబూని, యెన్ని నా
ళ్ళో యిఁక నీయవస్థ, యొడ♦లుం బడలున్, జర యన్న హెచ్చెఁగా
నాయెఁ, దలంప గుండె చెఱు♦వై గనుపట్టెడు నాయుదంత, మిం
కే యది నాకు దిక్కు వచి♦యింపఁగదయ్య తపోధనాగ్రణీ! 62

ఉ. ప్రాయము హెచ్చుటాయెఁ దల♦ ప్రాణము తోఁకకు వచ్చుటాయె, న
న్యాయముఁజూడనాయె, సుఖ♦ మన్నది దుర్లభమాయెఁ, జావు రే
పో యిఁక మాపొ యాయెఁ, జని♦ పోవఁ దిలోదక మిచ్చుదిక్కు లే
దాయె నికింతకన్నను దు♦రంతము గల్గునె మౌనిపుంగవా! 63

శా. సూనున్ రాజ్యమునందు నిల్పి పరమే♦శున్ భక్తిఁ బూజించుచున్
వానప్రస్థుఁడవై చరింపఁదగు నీ♦ వార్ధక్యమం దక్కటా
నానాకష్టచయాలవాలమయి గా♦నన్ వచ్చు నీరాజ్యముం
బూనంజెల్లునె, దేహమే కడు భరం♦బుం గొల్పఁగా దేశికా! 64

ఉ. ఎప్పుడు రాజ్యపుం గొడవ♦ లెప్పుడు సంసృతిగోష్ఠు లైనచో
నెప్పటి కింక జన్మ తరి♦యించుట? యింద్రియముల్ పటుత్వముం
దప్పినమీఁద మౌనియగు♦ దానఁ బ్రయోజన మేమి? గేహముల్
చప్పఁగఁ గాలునప్పుడొకో♦ జాగరియై మతి నూయి త్రవ్వుటల్? 65

గీ. అడవికేఁగ నరాజకం♦బౌను బుడమి, సదనమందున మునివృత్తి♦ సాఁగ దెట్లు
ముందు గతియేమి యనుచు రా♦త్రిందివంబు, మానసంబద్ది డోలాయ♦మానమయ్యె.

వ. అని యిట్లు హతాశాగతుండును, గులగురుండును సకలసద్గుణగరిష్ఠుండు నగు వసిష్ఠునకుఁ దన మనోగతం బెఱింగించి మఱియును. 67

మ. తనలోనే కుల మంతమందు ననుచిం ♦ తం జెందఁగాఁ, బుత్రిభి
క్షను గావించి దిలీపుఁ గాచి తపు డో ♦ జక్, నాకునుం గూర్చి సం
దను, భాస్వత్కుల మక్కటా దశరథాం ♦ తంబన్న దుష్కీర్తి నే
వినకుండన్ సవరింపుమయ్య సుకృతీ! ♦ విద్యాప్రభాసాకృతీ! 68

వ. అని యిట్లు దీనాలాపంబుల మొఱవెట్టుచున్న యానృపచంద్రునకు ముని చంద్రుఁ డిట్లనియె. 69

ఆ. సూర్యవంశ మవని ♦ సుత్రామ నీతోడ, నంతమందు ననెడు ♦ చింత యేల
సూర్యుఁ డుండువఱకు ♦ సూర్యవంశం బెట్టు, లంత మందఁ గలదొ ♦ యనఘ! సెపుమ.

గీ. పుత్రికులకోసరంబు వా ♦ పోవ నేల, యిష్ట మొనరించు పుత్రికా ♦ మేష్టియుండఁ
గొండ తలక్రిందఁ గనుపట్టు ♦ చుండ జాల, కొఱకు నూరూరునక్కటా ♦ తిరుగఁ జను నె.

ఉ. కష్టముగాఁ దలంపకు మ ♦ ఖండధరావలయేంద్ర! సన్మణీ
వేష్టితపాదపీఠ! సర ♦ విన్ మఱి యింతకు నాత్మజన్మలం
దిష్టము స్పష్టమై వెలిసె ♦ నేని యథావిధి నీవు పుత్రికా
మేష్టి నొనర్పుమా, భవద ♦ భీష్టము సర్వము పూర్తి యయ్యెడున్. 72

గీ. అనఘ! సకలగుణారాము ♦ లైనవారు, విపులలక్షణు లగువారు ♦ వినయభరితు
లైనవారును శత్రుఘ్ను ♦ లైనవారు, కొడుకు లుదయింత్రుపో నీకుఁ ♦ గువలయేశ!

వ. అని యిట్లు గురువరేణ్యుండు వలుక, నా రాజవరేణ్యుండు పెన్నిధిఁ బొడగన్న పేదచందంబున నపరిమితానందభరితుండై, యయ్యజ్ఞంబునకు వలయువిధానంబుల నెఱింగి, యొక్కనాఁడు నిజభృత్యామాత్యవర్గంబుతో బయలువెడలి యంగదేశంబుఁ బ్రవేశించి, యందు రోమపాదాభ్యర్చితుండై దీప్తాగ్నిం బోనివాని ఋష్యశృంగుం గనుంగొని యమ్మునీంద్రునకు వినయవినతుండై ప్రదక్షిణనమస్కారంబు లాచరించి, తాఁజేయు యజ్ఞంబునకు నమ్మహాత్ము నధ్వర్యుగాఁ బ్రార్థించి తదనుమతిం బడసి రోమపాదు సమీపించి,— 74

చ. జనవర! నీ కుమారికను ♦ శాంతను నల్లుని ఋష్యశృంగునిం
గనిగొని పిల్వవచ్చితి శు ♦ భంబుగ నొక్కముఖం జొనర్ప నం

దనులను గాంచుకోర్కి మెయి ♦ దానికి సమ్మతిఁబూని వారలన్
బనుపు మటంచు వేఁడ జన ♦ పాలుఁడు వల్లె యనంగ నంతటన్. 75

వ. ఒక్క శుభముహూర్తంబున శాంతాఋష్యశృంగసమేతుండై, వందిమాగధులు కైవారంబులు సేయ నయోధ్యాపురాభిముఖుండై వచ్చుచుం దగుశిల్పులం బిలిపించి యయోధ్య నలంకరింపుఁడని యానతిచ్చిన వారును, 76

సీ. కనకరంభాచయం ♦ బును వాకిళుల నిల్పి, నవరత్నములఁ దోర ♦ ణములు గట్టి
గంధోదకంబులఁ ♦ గలయంపి చల్లించి, ముత్యాలపొడులతో ♦ ముగ్గువెట్టి
ప్రతివీథి కొక చల్వ ♦ పందిలి వేయించి, జెండాలు మిన్నుఁదాఁకు ♦ చుండ నిలిపి
చంద్రకాంతముల ర ♦ చ్చల వేదు లలరించి, రాజమార్గముల శు ♦ భ్రముగఁజేసి
గీ. నిముసమాత్రంబులో మహీ ♦ రమణునాజ్ఞ, నేపు దీపింపఁగా నయో ♦ ధ్యాపురంబు
నాకలోకంబుకంటె న ♦ నేకగతుల, మించుకైవడి నపుడు గా ♦ వించుటయును.

ఉ. అంత నృపాలకాళి నిజ ♦ యజ్ఞవిలోకన మాచరింప సా
మంతనృపాలురన్ బిలువ ♦ నంపఁగ వారును నేఁగుదెంచి ర
త్యంతముదంబుతోడ నృపు ♦ నాజ్ఞఁ దలన్ బువుమాడ్కిఁ దాల్చి శు
ద్ధాంతజనంబుతోడఁ జతు ♦ రంగబలంబులతోడ వేడుకన్. 78

వ. అయ్యవసరంబున— 79

సీ. ఒక చెంత నిగమాంత ♦ నికరాంతరంగాలి, మాత్రమానితవిప్ర ♦ మండలమ్ము
ఒకవార నలమార ♦ సుకుమారధనురాగ, మోద్ధతరాజరా ♦ జోత్కరమ్ము
ఒకచోట మఖవాట ♦ నికటాటదతిధనే, శ్వరభోగవద్వణి ♦ క్సముదయమ్ము
ఒకచెంగటు నిమంగ ♦ సకలాంగసస్వేద, చంచచ్చరణజాత ♦ సంచయమ్ము
గీ. గలిగి ధరయీనినట్లొక్క ♦ కడననంత, రథములుఁదురంగములు సింధు ♦ రములు భటులుఁ
బరఁగఁగఁ బ్రపంచమెల్ల న ♦ ప్పత్తనమున, నమరినట్లుండెఁ బురవాసు ♦ లబ్రమంద. 80

క. ఎందఱు వచ్చినను మహా, తుందిలమై యప్పురంబు ♦ తోఁచె నృపున కా
నంద మిడి పుష్కలం బను, చందమ్మున నెంతయున్ వి ♦ శాలం బగుచున్. 81

వ. అంత దీక్షాకాలమ్ము ప్రవేశించుటయు, నమ్మహీరమణుండు మంగళస్నానమాచరించి ధౌతవాసంబులు ధరించి భార్యాసమేతుండై వసిష్ఠునానతి, సరయూతీరమ్మునం దమర్చఁబడినయజ్ఞవాటంబుఁ బ్రవేశించి, విప్రజనాశీర్వాదంబులఁ బడయుచు ఋష్యశృంగపురస్కృతులైనవశిష్ఠాదిమునిజనంబులెల్ల సవనతంత్రంబులు నడుపఁ, బుత్రకామేష్టికి నంగభూతంబుగా నశ్వమేధంబు యథావిధి సమంత్రకంబుగాఁ

బూ_ర్తిగావింప, నమ్మహీపాలుండును సంతుష్టాంతరంగుండై, యాజకుల భూరిదక్షిణల సంతుష్టులంజేసి, ఋష్యశృంగు సమీపించి, యయ్యా! పుత్రికామేష్టి నొనర్చి నన్ను ధన్యునిఁజేయుఁడని వేఁడిన, నమ్మునిపుంగవుండు హర్షంబు బెనంగొన, మంత్రవిధానంబులతో నాహుతుల నగ్నిహోత్రంబున వేల్చుచుఁ బుత్రికామేష్టి చేయుచున్నంత, నయ్యగ్నికుండంబునుండి, 82

ఉ. నల్లని మేన రక్తవస ♦ నంబు లొకానొకవింతకాంతి రా
జిల్లఁగ, నగ్నికీల లల ♦ సింగమువైఁ గలజాలుమాడ్కి భా
సిల్ల, దినేశుఁ డల్లు విల ♦ సిల్లుచుఁ బాయసపాత్రిపాణియై
మెల్లన దివ్యపూరుషుఁ డ ♦ మేయుఁడు వెల్వడె దుర్నిరీక్ష్యుఁడై. 83

వ. ఇట్లు వెల్వడి యాప్రాజాపత్యపురుషుండు తనకు, సాష్టాంగదండప్రణామంబు లాచరించి, తన చెంగట ముకుళితహస్తుండై నిలిచియున్న యన్నరనాథు నీక్షించి, రాజా! నీయిష్టంబునకు సంతుష్టుండనైతి, నిదిగో కులవర్ధనంబును బుత్త్రప్రదాన సమర్థంబును నగుపాయసం, బియ్యది నీధర్మపత్నుల కొసంగు మని యప్పాయసపూర్ణ కలశంబును జేని కొసంగి యదృశ్యుండైన నంత, 84

చ. నరవరుఁ డంత డెందమున ♦ నందను లుద్భవమౌదురంచు దు
ర్భరకుతుకంబు పొందుకొనఁ ♦ బాయసవృత్తము నాత్మపత్ను లె
ల్లర "కిది మిత్త్ర" మంచు సక ♦ లంబు ధ్రువం బొనరించి వార లా
దరమునఁ జూచుచుండ ద్వివి ♦ ధంబుగఁ బాయసముం బొనర్చుచున్. 85

గీ. అందు నర్ధంబు కౌసల్య ♦ కందులోన,నర్ధము సుమిత్ర కాయర్ధ ♦ మందు నర్ధ
మల్లకైకేయి కిడి తక్క ♦ నర్ధమెల్ల,మరల నిచ్చె సుమిత్ర క ♦ మ్మనుజవిభుఁడు.

మాలిని. వినుతజనకృశానూ! ♦ విద్వదంభోజభానూ!
అమరవిపినచైత్రా! ♦ యార్యసంస్తోత్రపాత్రా!
కుముదసరుగపాంగా! ♦ కోమలశ్యామలాంగా!
సమరవిదితబాహా! ♦ క్ష్మాసుతాశోభిదేహా! 87

క. ప్రశమితమునిబాధా! మహి, రశనాపరివేష్టిత స్థి ♦ రాతలనాథా!
దశకంఠకంఠలుంఠన!, విశదయశఃపూరితాశ! ♦ విశ్వాధీశా! 88

ఇది శ్రీ.................................................................................
పూర్ణప్రజ్ఞకవివిరచితం బగుశ్రీరామకళ్యాణంబునందుఁ బ్రథమాశ్వాసము.

---



శ్రీహయగ్రీవాయ నమః

# శ్రీరామకల్యాణము

## ద్వితీయాశ్వాసము



క. శ్రీనిత్యోజ్జ్వలగ్రహా! వి
ద్యానైపుణ్యాఢ్య! శ్రితజ ♦ నావనదీక్షా!
మానితచరితా! తాపస
మానసకాసారహంస! ♦ మాన్యవతంసా! 1

వ. దేవా! యవధరింపుము. ఇట్లావరవర్ణినులు భర్తృదత్తంబు, వంశాంకురాలవాలంబును నగు నప్పాయసంబు భక్షించి, కాలక్రమంబుగా గర్భంబు దాల్చినవారై యంతర్నిధి యగువిశ్వంభరాదేవివోలె నంతర్నిలీనపావకం బగుశమీవృక్షంబు చందంబున నంతస్సలిలం బగుసరస్వతీనదిభంగి విరాజిల్లు చున్నంత, 2

సీ. నడ లంతకంతకు ♦ నాదారులైపోయెఁ, జూచుకంబుల నల్పు ♦ చూడనాయెఁ,
మాయమై మధ్యంబు ♦ మరలఁ గన్పడనాయెఁ, దనియారునకు దృష్టి ♦ తాఁకనాయెఁ
జెక్కిళ్లు పాండుర ♦ శ్రీకిఁ గాఁపురమాయెఁ, వళులఁ దొల్తటి హాళ ♦ హళులువోయె
నాఁటినాఁటికి మృత్తె ♦ నోటి కిష్టంబాయెఁ, దినుబండముల నాస ♦ దీటిపోయె

గీ. ఓకిలింతలు, నిద్దుర, ♦ లొడలిబలువు, లలసతలు, ప్రాలుమాలిక ♦ లధికమాయెఁ
గూచుచుండియు లేవఁగా ♦ భారమాయెఁ బోను బో నంత నవమాస ♦ పూర్తియాయె.

వ. అంత నొక సుముహూర్తంబున, 4

మ. సరళంబై గ్రహపంచకంబుఁ దమయు ♦ చ్చస్థానమం దుండ, శ్రీ
కరమా చైత్రమునందుఁ, గర్కటకల ♦ గ్నంబందుఁ గౌసల్య, భూ
వరుఁ డిష్టంబు ఫలించి కౌతుకమహా ♦ వారాంనిధిం దేల నా
హరి కర్థం బగుపుత్త్రుఁ గాంచెఁ, దపనో ♦ ద్యద్ధామునిన్ రామునిన్. 5

గీ. అంత నొకదుముహూర్తంబు♦నందుఁ గైక, భవ్యచరితుని నయగుణ♦భరితుభరతుఁ
డనఁగఁ జెన్నారు నట్టినం♦దనుని గాంచె, నధిపుఁ డీకఁ బట్టరానంత♦హర్షమంద. 6
గీ. అంత నేకాదశీతిథి ♦ యందు విభుఁడు, భూరితరహర్షవారిధిఁ ♦ బొంగిపొరల
నవని లక్ష్మణశత్రుఘ్ను♦లనెడువారిఁ, దనయులనుగాంచె నాసుమి♦త్రాలతాంగి.
సీ. వినువీథినెల్లెడ ♦ విరివాన పొడసూపె, నప్సరస్సముదయం ♦ బాడఁదొడఁగె
గంధర్వజాతుల ♦ గానంబు వినవాయె, సురదుందుభులు మింట ♦ మొరయఁజొచ్చె
వందిమాగధులకై ♦ వారముల్ విలసిల్లెఁ, గమ్మతెమ్మెర వీవఁ ♦ గాఁదొడంగె
నగరి నెల్లెడఁ దూర్య ♦ నాదంబు లుదయించె, భూసురాశీర్వాద ♦ ములు చెలంగెఁ
గీ. జంద్రుఁ డుదయింప సంతోష ♦ సాగరమున
మునిఁగెడుచకోరముల మాడ్కి ♦ మనుజులెల్ల
రాముఁ డుదయింప సంతోష ♦ ధాములగుచు
వివశులై సౌఖ్యముల విఱ్ఱ ♦ వీఁగి రపుడు. 8
చ. నరపతికిన్ దనూజ జన ♦ నంబు ముదం బెనయంగఁ దెల్పుచున్
గరము దశద్దిశాదశము ♦ ఖం బగుచున్, గరికుంభకర్ణ దు
ర్భర మగుచున్ బురంబు నలు ♦ వైపులఁ బిక్కటిలెన్ సురాళికిన్
నిరుపమసౌఖ్యదం బగుచు ♦ నిస్సహణార్భటు లాక్కపెట్టినన్. 9
వ. అంత దశరథుండును సఫలీకృతమనోరథుండై, తన సంతోషంబునకుఁ దగి నట్లు విప్రజనంబుల భూరిదక్షిణల సంతుష్టులఁ గావించి, యిష్టమృష్టాన్నపానాదులఁ దనిపి యావన్నిష్ఠ నిష్టంబున. 10
గీ. జాతకర్మాదుల యథోక్త♦సమయమందు, సలిపి బంధుపురోహిత♦సహితుఁడగుచుఁ
బంచమాబ్దంబు చనుదేర♦బాలకులకుఁ, దలఁపఁగాఁజొచ్చె నివ్విధి♦ధరణివిభుఁడు.
సీ. చతురతీర్థ ♦ సాక్షాత్కరణదివ్య,వైభవా ఽఽభోగాన ♦ విద్య విద్య
అఖిలక్రియాపర ♦ మావధీభూతని, శ్రేయసావాప్తిని ♦ శ్రేణి వాణి
నిఖిలజనాపేక్ష ♦ ణీయ శిరోధార్య,భూరితరానర్ఘ ♦ భూష భాష
పరదారపరధనా ♦ హరణనానాపాప, భీషణవృత్తిదు ♦ ర్భిక్ష శిక్ష
గీ. గానమురిపంబుఁబూనక ♦ నూనములందుఁ, దగినకాలంబునం దుపా ♦ ధ్యాయుకడకుఁ
బనిచి తలిదండ్రులెంతటి♦పనులుమీఁద,నున్నఁ జదివించుటొప్పు లే♦కున్నఁదప్పు.
చ. అని మదిలోఁ దలంచి, వసు ♦ ధామరనాయకుఁ డంత నొక్కనాఁ
డనుపమలీల బంధుజను ♦ లందఱు మందిర మేగుదేరఁగా

వినయవిధేయతాదిగుణ ♦ విశ్రుతులన్ సుతులన్, బురోహితుం
డొనర నొనర్చినట్టి సుము ♦ హూర్తమునందుఁ బఠింపఁజేయఁగన్. 13

శా. సర్వామ్నాయరహస్యవేదియయి, యో ♦ జన్ సర్వశాస్త్రంబులం
దర్వాచీనులకంటె నెక్కుడుగ వి ♦ ద్యావైదుషిం గాంచి యా
సర్వజ్ఞుం బురుడించునొక్కని యశ ♦ శ్చంద్రున్ దయాసాంద్రు నం
తర్వాణిం బిలిపించి కౌతుకము చి ♦ త్తంబందుఁ దళ్కొత్తఁగన్. 14

ఉ. ఆరయ నెట్టిజాతిమణు ♦ లైనను బండితదివ్యశాణసం
స్కారములేని వే ధరఁ బ్ర ♦ కాశిలఁజాలవు, మాటలేల, వి
స్తారధనాఢ్యుఁడో, నృపతి ♦ తల్లజుఁడో, గుణమేఘశోభనా
కారుఁడునో, ద్విపాత్పశువు ♦ గాఁడె మనుష్యుఁడు విద్య లేనిచో. 15

క. భూషణములె హారాదులు ?, యోషలకుంబోలెఁ బండి ♦ తోత్తమ ! ధాత్రిన్
భాషింపఁగనేలా ? వా,గ్భూషణమే భూషణంబు ♦ పో, పురుషులకున్. 16

ఉ. ఈక్షితి నంధసంతమస ♦ మెల్ల నడంచి జగత్త్రయంబుఁ, బ్ర
త్యక్ష మొనర్పఁగాఁ దగిన ♦ యక్షి వివేకము; గాన వీరి కా
శిక్షయొసంగి, యంధు లని ♦ పించక మాకులవృద్ధుఁ డౌజగ
చ్చక్షువుపోల్కిఁ గొంత కొన ♦ సాఁగఁగఁజేయుము పండితోత్తమా ! 17

వ. అని యిట్లాధరాఖండలుండు, వివిధసత్కారంబుల నప్పండితాఖండలుఁ బూజించి, మూర్తీభవించిన చతుర్వేదంబుల మాడ్కిఁ జెలంగు నిజపుత్రుల నాతని కప్పగించిన, నాతండును, 18

గీ. వాసి గర్భస్థమౌ కేత ♦ కీసుమంబుఁ, బరిమళముచే నెఱుంగు బం ♦ భరముమాడ్కి
నాకృతులచేత నవ్వారి ♦ యంతరంగ, పాటవంబులు క్షణములో ♦ పల నెఱింగి.

క. వీరలకు విద్యసెప్పినఁ, బేరుఁ బ్రతిష్ఠయును గల్గుఁ ♦ బెంపగు నాసం
స్కారముఁ, బైపెచ్చుగ సమ,కూరున్ సత్పాత్రదాన ♦ గురుపుణ్యంబున్. 20

వ. అని యంతరంగమున నుప్పొంగుచు, నృపుఁ డిచ్చిన జాంబూనదాంబరంబుల ధరించి, నిజగృహంబున కబ్బాలకులఁ దోడ్కొనిపోయి యంత 21

చ. అధికతరానురాగము, స ♦ హోదరభావము నొప్పుచుండ, నోం
ప్రథమమునుండి వారు తగు ♦ పాటి క్రమంబునకెల్ల నైఁచి స
త్పథమున నిల్పి యేదినము ♦ పాఠము నాదిన నప్పఁజెప్ప స
ద్విధి సకలమ్ము వేడ్కఁ జది ♦ వించె గురుండు, గురుండు మెచ్చఁగాన్. 22

మ. సారిదిన్ వారిటు కొన్నినాళ్లకుఁ బర ♦ శ్లోకాన్వయవ్యాప్తి వ్యా
కరణానూనతరైకపాండితి, నలం ♦ కారప్రకారమ్ము, సుం
దరవాచావిభవంబు, నేర్చి ధర నే ♦ తాదృక్షనుల్ లేరనన్
దిరమౌ కీర్తిఁ గాంచి రల్ల నృపుఁ డెం ♦ తే సంతసంబందఁగాన్. 23

మ. ఘనతన్ లక్ష్మణు మించె రాఘవుఁడు, వీఁ ♦ కన్ రాఘవున్ లక్ష్మణుం
డును, శత్రుఘ్నుని మించఁబూని భరతుం ♦ డున్ వాని శత్రుఘ్నుఁడుం
దనివింజెందక యొక్కరొక్క రిటు "వి ♦ ద్యా స్పర్ధయా వర్ధతే"
యను లీలన్, విజిగీషులై చదివి ర ♦ య్యాచార్యుఁ డుప్పొంగఁగన్. 24

చ. అనువగుదారిఁ జూపు నెడ ♦ నల్లుకొనంగలయా నృపాలనం
దనులకుఁ జెప్పుటన్నఁ బ్రియ ♦ దంబుగ నుండెను గాని, దేశికేం
ద్రున కొకనాఁడుఁ గష్టమని ♦ తోఁచను, తాడుల నెక్కువారి నెం
దనుక భరింతుప్రపో! తమకుఁ ♦ దా మొకమార్గముఁ జూచుకొనిపోన్. 25

ఉ. ఎందతి దేశికుండు తరి ♦ యింపుగఁ జూచిన ధాటి కాఁగి యా
యందఱిలో నృపాత్మజులె ♦ యక్కజకుం జనుదెంచినార, లే
మందును లోకబాంధవుఁడ ♦ నంచు ముదం బిడఁబూనుఁ గాక, మ
ధ్యందినభానుఁ డల్ల కుము ♦ దంబులకుం బ్రమదంబు నిచ్చునే. 26

క. ఈగతి సాహిత్యాదుల, నాగమములయందుఁ గీర్తి ♦ కావాసములై
యాగురుని చెంతనే ధను, రాగమమునఁగూడఁ గుశలు ♦ లై యటు పిదపన్. 27

చ. గురుఁడు తనంతఁదాఁ బిలిచి ♦ కోవిదులైతిరి పొండటంచు నా
దరమునఁబల్క, వారు, గురు ♦ దక్షిణలం గయి సేయ మేదినీ
వరునియనుజ్ఞచేత విభ ♦ వంబుకొలంది సమస్తభంగులన్
గురుని యజించి, రంత జన ♦ కుండును సంతసమంది యాత్మలోన్. 28

క. పంచశరరూపులై దీ, పించుచుఁ దనరారునట్టి ♦ ప్రియతనయులకున్
పంచదశాబ్దంబు సమీ, పించి వయశ్శ్రియుఁ గాను ♦ పించఁగ నంతన్. 29

ఉ. పెండిలి సేయుఁ గోర్కె మదిఁ ♦ బీతము పెట్టి చెలంగ నాధరా
ఖండలుఁ డంతఁ బుత్త్రకుల ♦ కై యనురూపవయోవిలాసలౌ
నండజయాన లెవ్వరొకొ ? ♦ యంచుఁదలంచుచు, దీర్ఘచింతలో
నుండఁగ నొక్కనాఁటి యరు ♦ ణోదయమందు శుభోదయంబుగన్. 30

సీ. తనరాక ముందు దా ♦ దౌవుల నెఱిఁగించు, బ్రహ్మతేజఃప్రభా ♦ పటలితోడ
శ్రుత్యలంకారభా ♦ సురుఁడంచుఁ దనుఁదెల్పు, లలితకుండలయుగ ♦ ళంబుతోడ
నిరతంబుఁ దనతపో ♦ నియమంబుఁ జెప్పక, చెప్పెడుఘనమృగా ♦ జినముతోడ
తనను విశుద్ధజీ ♦ వనుఁడంచుఁదెలుపు ని, ర్మలజలాంచితకమం ♦ డలువుతోడఁ
గీ. దనకు శాస్త్రికబుద్ధి వి ♦ ద్యానిధులకు,జ్ఞాపకముఁజేయఁ గలకుశా ♦ గ్రములతోడ
దారిలోఁదన్నుఁగాంచెడు ♦ వారు భక్తి, చేత సాష్టాంగనతులను ♦ జేయుచుండ. 31

శా. మేనం జన్నిదముల్ తటిన్నిభములై ♦ మించం గిరీటంబు చం
దానన్ మస్తకమందుఁ గెంజడలమొ ♦ త్తంబుం బ్రకాశింప, వి
జ్ఞానాంభోనిధి వచ్చెఁ గౌశికుఁడు మే ♦ చక్ యోఁడు సాక్షాద్బ్రహ
ద్భానుండో! ఖరభానుఁడో! యని సభా ♦ స్తారుల్ విలోకింపఁగన్. 32

ఉ. వచ్చినమౌనివర్యుఁ బరి ♦ వారముతో నెదురేగి మ్రొక్కి, పెం
పచ్చపడంగ నొక్కయుచి ♦ తాసనమందునఁ జేర్చి, కోర్కెతోఁ
జెచ్చెర నర్ఘ్యపాద్యముల ♦ చేఁ బరితుష్టు నొనర్చి, వేడ్కనో
సచ్చరితాగ్రణీ! తమకు ♦ స్వాగతమే యని పృచ్ఛ సేయుచున్. 33

ఉ. నేఁడుగదా మదన్వయ మ ♦ నిందితమై తనరారె ధాత్రిలో!
నేఁడుగదా కరంబు గణ ♦ నీయుఁడ నైతి నృపాలకోటిలో!
నేఁడుగదా తరించితి! గ ♦ ణించిన పుణ్యము నాదుజన్మలో
నేఁడుగదా ఫలించె! మహా ♦ నీయచరిత్రుల మిమ్ముఁజూచుటన్. 34

ఉ. వెయ్యి వరా లొసంగినను ♦ విశ్రుతమౌ భవదీయదర్శనం
బయ్యది సంభవించునె? జ ♦ డాత్ముని నన్నుఁ దరింపఁజేయఁగా
నెయ్యెడనుండి యెయ్యెడకు ♦ నేగుచు నియ్యెడ కేగుదెంచి నా
రొయ్యనఁజెప్పి, యో మునికు ♦ లాగ్రణి! వీనుల విందు సేయుమా. 35

సీ. సేమమే సుతనిర్వి ♦ శేషంబుగా మీరు, సాఁకుచుండెడు కృష్ణ ♦ సారములకు?
సౌఖ్యమే మీకు మీ ♦ ఛాత్త్రుల కాధార, ముగ నున్న యాశ్రమ ♦ భూజములకు?
కుశలమే హోమంబు ♦ కొఱకు నాజ్యము దిన, దినము మీకిడుహోమ ♦ ధేనువులకు?
నిర్విఘ్నమే ప్రతి ♦ నిత్యంబు మీచేయు, స్నానసంధ్యాద్యను ♦ ష్ఠానములకుఁ?
గీ. దెలియఁగాఁజెప్పి, యుష్మదా ♦ దేశకరణ, సువ్రతైకదీక్షాలాల ♦ సుందరైన
నాదుడెందంబు నూఱట ♦ నందఁజేయు, ధన్యగుణగణసాంద్ర! యో ♦ తాపసేంద్ర!

చ. నిలయములందు మీరు కడు ♦ నిష్ఠ మెయిం దపమాచరించుచోఁ
దలవనియట్లుగా నటుకుఁ ♦ దాఁకొని సింగము లెవ్వియేనిఁ గ్రొ
ల్పులు లెవియేని మిమ్ముఁ బలు ♦ పోకల నారటు పెట్టి విఘ్నముల్
సలుపవుగా వచింపు ముని ♦ సత్తమ! మీదుతపస్సమాధికిన్? 37

ఉ. భావిమహాపకారము ల ♦ వంబు నెఱుంగకయే "వినాశకా
లే విపరీతబుద్ధి" యను ♦ లీలఁ జరించుచు, మీర లాజ్యముం
బావకమందు వేల్చుతఱి ♦ భంగ మొనర్చుతలంపుతోడ, దు
ర్భావులు వానినెల్లఁ జెఱు ♦ పన్ సమకట్టరుగా? తపోధనా! 38

క. నేమమున మీరు భగవ, న్నామం బొనరించుపట్టు ♦ నన్ విఘ్నములై
స్వామీ! మిము మీశిష్యులఁ, బాములు బాములను బెట్టి ♦ బాధింపవుగా? 39

ఉ. డంబుగ వీర లాఁపవి ♦ డంబన నుండఁగ మీదుధాతవా
సంబులు నంబుపూర్ణకల ♦ శంబులు యోగ్యములో పలాశదం
డంబులుఁ గూరుచుండుననఁజి ♦ నంబులు దాఁచరే? దొంగ, లంతరా
యంబులు మెండుగా శుభచ ♦ యంబున కెందును? గాధినందనా! 40

క. హితమతి మీయుపవాస, వ్రతములు మీదేహములను ♦ బాధింపవుగా?
నుతచరితా! దేహంబే, గతిగాదే యెందుఁ బుణ్య ♦ కర్మల కెల్లన్? 41

ఉ. కొంచకుఁడయ్య యెవ్వఁ డను ♦ కొంటిరొ నన్ను మునీంద్రచంద్ర! మీ
పంచినకార్యమున్ సలుపు ♦ బంటును గానొకొ ప్రాణమేని న
ర్పించెద మీకు సౌఖ్య మొన ♦ రించెద మీదుమనోరథంబు సా
ధించెద నిశ్చయంబుగ మ ♦ రిన్ గలసర్వము నిర్వచింపుమా. 42

ఉ. ధారుణి యజ్ఞముల్ సలుప ♦ ద్రవ్యము లేకయొ, యీదురంతసం
సారమునందు ముక్తిఁ గన ♦ జాలనిమమ్ముఁ దరింపఁ జేయనో,
దారుణకృత్య మేమయిన ♦ దాఁపురమాయెనొ దెల్పుఁ; డూరకే
రారు మహాత్ము లెందుఁ దమ ♦ రాకకు హేతువుఁ దాపసోత్తమా! 43

క. అని గుచ్చిగుచ్చి యడిగిన, మునినాథుం డంత మోద ♦ మున జననాథున్
గని చాటుగర్భవాక్యం,బునుగా నిటువల్కెఁ బ్రకృత ♦ మును సాధింపన్. 44

ఉ. పెద్దలయందు భక్తియును ♦ బేరు ప్రతిష్ఠలయందు రక్తియున్
బుద్ధులయందు సక్తియును ♦ బొడఁగ సూర్యకులీనులైన మీ
యొద్దఁ జెలంగుఁ గ్రొత్తలన ♦ నొప్పవుగాని, మహానుభావ! మీ
పెద్దల నెల్ల నేఁడు మఱ ♦ పించెను మీ, భవదీయ నమ్రతల్. 45

ఉ. భోగ్యముగా మునీంద్రులిరి ◆ బోణిని బొందనిజిష్ణు, భోగసౌ
భాగ్యముచే భుజంగపతి ◆ భావముఁ గాంచనిభోగి, ఔనిగా
యోగ్యుని నిన్నుఁ జేకొనుట ◆ యోదిననాథకులీన! మా తపో
భాగ్యముగాదె, సర్వసుర ◆ పన్నగజాతులకంటె నెంతయున్. 46

చ. అడుగుటె దవ్వుగాఁ బ్రజల ◆ యాశయ మెల్ల నెఱింగి యప్పుడ
ప్పుడె యిఁక రేపుమాపనక ◆ పూర్ణమనోరథులన్ బొనర్చి యే
యిడుములఁజెందనీక తన ◆ యిష్టతనూజులమాడ్కిఁ జూచు నీ
వాడయఁడవౌట నీప్రజల ◆ యున్నతిగాదె? వివేకసాగరా! 47

ఉ. అన్వహ మింతకుం బ్రజకు ◆ నభ్యుదయానుభవమ్ము, నల్లరా
జన్వతియా నదృష్టదశ ◆ సాగరమేఖలకున్ దలంప మీ
యన్వయవాసు లెల్లరకు ◆ నందుఁ దరించెడి యోగ మోక్షపో
దన్వదుదార! యొక్క పరిఁ ◆ ద్వన్నృపతిత్వముచేతఁ గల్గెఁ బో. 48

శా. "రాజ్యంబందుఁ బ్రజానురాగ మలరా ◆ రక్షా నూదిలో దార మ
ట్లీజ్యామండల మేలు నీయెడ నహో ◆ "ఏడః పదాన్తా దతి"
ప్రాజ్యవ్యాకరణోక్తి లేనియెడలన్ ◆ బాటించి, లోకోక్తియా
"రాజ్యాంతే నరకం ధ్రువ" మ్మనుట క ◆ ర్థంబేమి? భూపాలకా! 49

ఉ. ఎందఱు లేరు రాజులని ◆ యెప్పుడుఁ బైపయి విఱ్ఱవీఁగు వా
రెందుకు, గోత్రవైరి యొకఁ ◆ డింకొకఁడన్నఁ గళంకమూర్తి, యీ
చందము నందు రందఱును ◆ సద్గుణముల్ గన వారిలోన ని
న్నుం దులదూఁగువాఁ డొకఁడు ◆ నుం గలఁడా? రఘువంశపావనా! 50

చ. కలవితమే, ముఖస్తవము ◆ గా ననుకొందువో, యేమొ, యీధరా
వలయమునందు నల్లభగ ◆ వంతునిఁ బుత్త్రిఁగఁ గాంచి మాదుక
న్నుల కఱవెల్లఁ దీర్చిన ఘ ◆ నున్, నినుఁజూచుట మా యదృష్టపుం
గలిమియెగాక, యేమియనఁ ◆ గావలయున్ ధరణీపురందరా! 51

క. నేఁడు తరించితి మిమ్ముం, జూడఁగ మీరలు గృహంబుఁ ◆ జొచ్చుటచే నం
చాడుచు జగతీపాలా!, పాడియె నన్నొక్క పెద్ద ◆ పాటిగఁ జేయన్? 52

ఉ. నేఁటిదినంబు నావలన ◆ నీవు తరింపఁగ లేదు నూవె, మా
బోటులు వచ్చుచుండెదరు ◆ పోవుచునుందురు, దానికేమి? యే

నాఁటు భవన్ముఖంబునఁ గ ♦ నంబడి పాయస మిచ్చె నగ్ని యా
నాఁటిదినంబె నీదుజన ♦ నంబు ఫలించి తరించె నెంతయున్. 53

క. పోఁడిమిగఁ జేరియున్నెడఁ, గీడే మదిఁ దోఁచునన్న ♦ క్రియగా నీ వి
ట్లాడితివిగాని, మా కా, జాడం జేకూరునయ్య ? ♦ సౌజన్యనిధీ ! 54

చ. కుతుకముగాక యేమి, నృప ♦ కుంజర ! నీవు చతుస్సముద్రము
ద్రితమయి యొప్పు నీవసుమ ♦ తిం గయిఁబూని, పరానపేక్ష, నా
తతభుజశక్తిమైఁ గడుము ♦ దంబున నేలుచునుండ నింక నే
గతి సమకూరు మా కశుభ ♦ కాండము ? నీవ యెఱుంగఁగావలెన్. 55

ఉ. మానవనాథ ! నీకలిమి ♦ మానసశృంఖలసంనిబద్ధపం
చాననులై చెలంగి, యని ♦ శమ్ముఁ దపస్స్వనవ్రతాద్యను
ష్ఠానము లాచరించుముని ♦ సత్తము లేడ, విచిత్రమౌను, బం
చాననజాతి యేడ, నప ♦ చారము లేడ నెఱుంగఁ బల్కుమా ? 56

ఉ. ఇంతకుఁ జేరిమ మున్నయది ♦ యెక్కుడు మాయెడ నీకు, నోధరా
కాంత ! ధరిత్రి నీవె యొక ♦ కంటఁ గనుంగొనుచుండఁ బౌండరీ
కాంతమహాధ్వరంబుల న ♦ నంతములం బొనరించుమాకు నా
వంతయుఁ బుండరీకముల ♦ యారటముల్ కలనైనఁ గల్గునే. 57

చ. వలసినవస్తుకోటి, త్రిది ♦ వంబున నే, ఫణిలోకమందు నేఁ
జెలఁగెడిఁగాక, మాకు నజ ♦ చేతనె చూపుచుఁ బైన సాధ్వసా
కులులయి "ఓ" యనంగ "నిది ♦ గో"యని, కంటికి ఱెప్పమాడ్కి నీ
వలరఁగ గంటఁ జూడఁగల ♦ రా ? నరమాతృలు మమ్ము భూవరా ! 58

ఉ. నీవ సమస్తభూతధర ♦ ణిం దలఁబూని ఫణీంద్రసర్వగో
త్రావహనార్తిఁ బాపఁగఁ గృ ♦ తఘ్నత నీప్రజమీఁది కెట్టు లా
శీవిషకోటిఁ బంపు మది ♦ చే సతఁ డంపిన నంపుఁగాక, యే
భావముతోడ నవ్వి మము ♦ బాములఁ బెట్టుఁ గుశీలవాగ్రణీ ! 59

చ. అలమధుపానమత్త మగు ♦ నామధుపప్రకరమ్ము మావనం
బులఁ గనకంబు గన్పడిన ♦ ముట్టదువో యన నేల మాదువ
ల్కలముఁ, బలాశదండము, మృ ♦ గత్వచ మియ్యవి సన్న్యసింప నా
నలతరమై వ్రతంబుచెడి ♦ నజా సుఖమైనను గాంచు టొప్పదే ? 60

మ. తపనుండే భవదన్వయప్రథముఁ డా ♦ తండేగదా! నీరజన్
గృపఁ జేకూర్చ నతండె నీదుప్రజలన్ ♦ గీడెంచునా? యేమియా
నుపవాసంబులచేత మాకు, వినవో ♦ హో! యెందుఁగూర్చుండినన్
నృపతీ! వర్ధనఁజేయువాఁడు మనవాఁ ♦ డేనిన్ భయం బేటికిన్. 61

చ. పలుమఱుఁ గోర్కెఁ దెల్పుమని ♦ పల్కెద వేమి వచింతుఁ గానవం
బులఁ గనిపించునాకు లల ♦ ముల్ దిని కాలముపుచ్చు నిస్పృహా
త్ముల మగుమాకుఁ గోరికల ♦ తోఁబనియేమి, ధరిత్రి మాకుఁ గా
వలసిన వస్తు వేది? భగ ♦ వంతుఁడు దప్ప నృపావతంసమా! 62

క. ఐనను, నీయుత్సాహం, బే నేటికి భంగపఱుప ♦ నెంచవలయు ధా
త్రీనాయక! చెప్పెద నవ, ధానమనస్కుండవగుచు ♦ దానిన్ వినుమా. 63

క. కాననముల, మాసదనస్థానంబుల కేమిలోటు ♦ జరుగక యుండున్
గానీ, యెందును "బహువిఘ్నాని శ్రేయాంసి" గాదె ♦ కారుణ్యనిధీ! 64

ఉ. రక్కసు లిద్ద రెంతయుఁ బ ♦ రాక్రమశాలులు, మేము జన్నముల్
చక్కఁగఁ జేయునప్పటికిఁ ♦ జయ్యన వచ్చి కలంచి, మమ్ములన్
జిక్కులఁబెట్టి యగ్నుల న ♦ సృగ్ఝరముల్ గురిపించుచుందు రే
దిక్కునఁజూచినన్ గనుల ♦ దీప్తికిఁ దాఁక రదృశ్యదేహులై. 65

ఉ. దానినిఁ జక్కఁబెట్టి ప్రక్రి ♦ తంబగు మాదశరాత్రయాగమున్
బూనిక నెట్టివిఘ్నలవ ♦ ముం జొరకుండఁగ రక్షసేయ నీ
సూనుని బంపఁగావలయు ♦ సూనృతవాక్యధురీణ! యధ్వరం
బైనయనంతరంబె శుభ ♦ మందఁగఁ బుత్త్రకు నప్పగించెదన్. 66

క. మాయింపఁగ వారిఁ దపో, వ్యాయామమె చాలు ♦ నంతవలయునె? గోటం
బోయెడుదానికి గొడ్డలి, నేయన్ లాభంబుగలదె ♦ యినకులతిలకా! 67

శా. బాలుండంచును సంశయింపకు ధరా ♦ పాలుండు రాముండు ని
ర్వేలాతిక్రమవిక్రముండు సమరో ♦ ర్వీమండలిన్ బ్రజ్వల
జ్జ్వాలాజాలము లొప్పుబాణముల శ ♦ స్త్రాశస్త్రిఁ గ్రీడించుచోఁ
గాలుండేనియుఁ దేఱిచూడఁగలఁడా? ♦ కాకుత్స్థవంశాగ్రణీ! 68

క. అని యిట్లు మౌని భాషించినవాక్యము లానృపాలు ♦ చెవులకు ములుసోఁ
కినగతిఁ దత్క్షణమే తనమనమును గలఁగింప నృపతి ♦ మానసమందున్. 69

చ. అఱువదివేలవత్సరము • లై పడరానిక్రియంబుఁ జెంది దు
ష్కర మగుయజ్ఞముఙ్ సలిపి • కానక కన్నటువంటివారి కె
ల్లరకును శ్రేష్ఠు, నారఘుకు • లంబున కాభరణంబుఁ బాసి యే
కరణి మెలంగ నేర్చెదనొ! • కానను జీవముతోడ నీపయిఙ్. 70

చ. పసుపకయున్న సధ్వరము • పాడగు నేమొ యటంచు భీతియోఁ
బసిచిన రామచంద్రు నెడఁ • బాసి యిలఙ్ మనఁజాల నింతకుఙ్
ముని యతికోపి, యేమనునొ! • ముందఱఁబోయిన గోయి వెన్కఁబో
యిన మఱి నూయి యన్నగతి • యే గనిపించెడు నాకు నక్కటా. 71

సీ., గాధినందనుండు • కౌతుక మాత్మలోఁ, జెందునట్లు క్రతువు • చెడక యుండ
సుతుని బంపకుండఁ • జూచెద శేమైన, మంచిమార్గ మున్న • మదిఁదలంచి. 72

వ. అని ముహూర్తకాలంబు దీర్ఘాలోచనంబుఁ గావించి యంత నమ్మనీశ్వ
రాభిముఖుండై యామహీశతమఖుండు, 73

చ. జలజహితాతితేజ! తమ • సన్నిధి నీపదునాళ్ళు నేను నా
బలములతోడ నిల్చి క్రతు • భంగ మొనర్చెడుక్రూరకర్మలన్
గలఁచెద మీదుయాగమును • గాచెద రామునితోడ నేమి? నా
చలము బలంబు మున్నయిన • సర్వము నీక యెఱుంగనయ్యెడున్. 74

మ. పరహింసాపరులై మెలంగెడు మహా • పాపాత్ము లాయామినీ
చరు లేడన్ గ్రతురక్ష యెచ్చట మునీ • శా! నోట వేల్వెట్టినన్
గఱవంజాలఁడు, వెన్న వెట్టినను మ్రిం • గన్ లేఁడ యిబ్బాలుఁ డే
కరణిన్ మీపనిఁ జక్కఁబెట్టఁగలఁడో • కాసంత యోజింపుమా. 75

వ. అని రాజచంద్రుం డనిన మునిచంద్రుఁడు దరహసితాననుండై, 76

ఉ. ధారుణినాథ! యీయసుర • తల్లజు లన్నను జెడ్డవారు సా
ధారణులంచు నెంచకు మె • దన్ వనవహ్నికి గాలిమాడ్కి నా
క్రూరుఁడు రావణుండట నను • కూలుఁడు వారల, కింక వారితోఁ
బోరుటయన్న నన్న! మిము • బోంట్లకు మృత్యువుతోడఁ బోరుటే. 77

ఉ. ఆకతినాత్ము లన్నను, సు • రాసురఘోరరణంబులందు ము
క్కాకలు దీరినట్టి మొన • గాండ్రు రణంబున వారితో కతన్
ఢాకతొ నాఁగువాఁడుఁ గలఁ • డా! యొకవేళను నాఁగుఁగాక పో
నాకవిభుండో బల్మిని బి • నాకవిభుండో జయింప నేర్తురే. 78

క. సుందోపసుందులని విని, యుందువు, నీ వట్టిదుర్గ ♦ ణోదధుల, కిసీ
నందనులు వారు, వాక్రు, వ్వందరమా! వారి సుగుణ ♦ వైభవ మింకన్. 79

క. తాటక, యుత్పాటితమఖ, వాటిక, దళదరిమనఃక ♦ వాటిక, యది యా
పాటచ్చరులకుఁ దలియఁట, పాటింపఁ దరంబె వారి ♦ బాహుబలంబున్ ? 80

క. ఆరాత్రించరులం దొక, వీరు, సుబాహుం డటండ్రు ♦ వేఱొకవీరున్
మారీచుఁడండ్రు, వారల, పేరులు వీనులకు ముండ్ల ♦ పేరులు భూపా ! 81

చ. కనికడివారికేనియును ♦ గుండె గుభాలను వారినామముల్
వినువెడ, దీనియందు నణు ♦ వీసమయేని నసత్యలేశమున్
గనఁబడ, దింక వారి ఘన ♦ కాయము వారల భీషణాకృతిన్
విని, కని, యుండఁబోము పృథి ♦ వీవర ! మేను వడంకుఁ జేర్కొనన్. 82

ఉ. ఏయనఘాత్ముఁడేని వధి ♦ యించునె వారల, నీసుతుండు నా
రాయణమూర్తి, రాక్షసవ ♦ ధార్థము పుట్టినవాఁడుగాన, నీ
సాయముఁజేయుమంచు గుణ ♦ సాగర వచ్చితిఁగాని, లేనిచో
నీయెడ కేఁగుదెంచెదనె ? ♦ యీగతి నేమియు నెంచకుండనే. 83

క. అని, భీతిగలుగఁ బలికిన, విని, మునివాక్యముల కధిక ♦ విహ్వలుఁడగుచున్
జననాయకుండు మునితో, ననుమానములేక యిట్టు ♦ లాడఁదొడంగెన్. 84

ఉ. భండనభూమియందుఁ గనఁ ♦ బడ్డ "నమో నమ" యంచుఁ దొల్గ నా
ఖండలునంతవాఁడు దళ ♦ కంతున, కాతఁడె యండగాఁగ ను
ద్దండత నుండుదైత్యసము ♦ దాయము రాముని లెక్కసేయునా ?
కొండలె మ్రింగువారలకు ♦ గోపురముల్ మఱి యడ్డువచ్చునే ? 85

మ. అకృతాస్త్రుండు శరప్రచార మెఱుగం ♦ డాజిక్రియాదూరుఁ డ
ర్భకుఁ డారాక్షసభీషణాకృతుల కె ♦ వ్వంగిన్ బ్రవర్తించునో
యిఁక మీరాడెడువాక్యముల్ వినిన నా ♦ కే మేను కంపించెడున్
సకలజ్ఞుండవు, నీవు రాము నడుగం ♦ జన్నే మునీంద్రోత్తమా ! 86

ఉ. ఏమయి యేమి యౌనొ విబు ♦ ధేంద్ర ! జయాపజయంబులన్న, సం
గ్రామమునందు నిత్యములు ♦ గా, వొకఁ డీల్గు నొకండు గెల్చు, న
ద్దామత నిర్వురున్ విజయ ♦ ధాములు గారు, గుణాలవాల ! శ్రీ
రామునియందు నాకు నను ♦ రాగము మెం డీఁక నేమి సేయుదున్. 87

క. శ్రీరాముఁడప్ప నన్యముఁ, గోరికొనుఁడు తత్క్షణంబ ♦ కొనసాగింతున్
సారాచారా! పారావారావృతభూతలంబొ ♦ భాండారంబో. 88

క. అంచితబాహుబలుండై, మంచి చెడుల్ దెలియుమీఁద ♦ మా రాఘవుఁ బం
పించెద, రాక్షసులను దుని, మించెదఁ, బ్రకృతంబునన్ క్షు ♦ మింపుము మౌనీ! 89

క. అని పలుక న్నగ్నిహోత్రిం, బున నాజ్యముఁ బోసినట్లు ♦ పొంగి కనలుచున్
ముని పండ్లు కొఱికి, పటుని, స్వనమునఁ దీవ్రముగ నిట్లు ♦ పలుకం దొడఁగెన్. 90

ఉ. ప్రాణమునైన నిత్తునని ♦ పల్కి యిటుల్ పొనరింతువా? నృపా
వాణి! భవన్ముఖంబుఁ గను ♦ వారికిఁ బాపము లుద్భవిల్లుఁ గ
ల్యాణము లంతరించు, నిఖి ♦ లంబు ఖిలంబగు, నిన్నుఁబోలు వి
శ్రాణనశాలి భూమికి భ ♦ రంబు కరంబు స్వకార్యతత్పరా! 91

చ. ధనములతోడ నేమి జడ ♦ దారుల కక్కట, మేదినీతలం
బును దలమీఁదఁ బెట్టుకొని ♦ పోయెదమే? యిఁక మాకుఁ బన్కుమా
లిన విడ దానశౌండుని వ ♦ లెన్ జనుదెంచెద చెప్పు డిచ్చకం
బును బచరించునట్టిరులె ♦ హా! నృపులన్నఁ బ్రపంచమందునన్. 92

వ. అని జ్వలజ్జ్వలనుండుంబోలె సింహాసనంబున మండిపడుచున్న విశ్వామి
త్రుం గాంచి ధరాకాంతుఁ డంతరంగంబున— 93

ఉ. కత్తెరబోను రాజ్యమనఁ ♦ గా, నృపుఁ డెంతటి జాగరూకుఁడై
యొత్తిలుఁగాక, గాయము లె ♦ వో! ఘటియిల్లెడు, మేలె నేయనీ
మొత్తమీఁద దుర్వ్యథమె ♦ ముందుగ వచ్చెడు, నెట్టు లుండుఁ గా
కత్తెరకు మంచి లభ్యమగు ♦ నా? మఱి వేమునఁ దీపి పుట్టునా? 94

ఉ. "ఆ" యన నీమునీంద్రున క ♦ హా! యపశబ్దము గాఁగఁదోఁచె "నా
రాయణ" యన్నఁ బెద్ద యప ♦ రాధముగా నగుఁ, గోప మెక్కుడై
పోయె, శపించు నన్న భయ ♦ మున్ జనియించెఁ గుమారు నెట్టకే
నీయుట తప్ప నింకఁ దెరు ♦ వేయది గానఁగరాదు నా మదిన్. 95

వ. అదియునుంగాక 96

చ. క్షితిపతిపాలనంబునకుఁ ♦ గౌశికునంతటివాఁడు వచ్చి నీ
సుతు నిటు పంపుమన్న నిఁకఁ ♦ జూడఁగ నేల యొసంగలేదు దు
ర్మతి దశరథుఁ డన్నయవ ♦ మానముఁ జెందఁగ నేల, నిందతో
బ్రతుకుటకంటెఁ జచ్చుటె శు ♦ భంబగు మానము గల్గువారికిన్. 97

క. నావలన దేహమే యిడి, కేవలముఁ బరోపకార ♦ కృతులైనధరి
త్రీవిభుల కాలయం బగు, మావంశం బింక నేల ♦ మంటం గలయన్. 98

వ. అని తలపోసి యెట్టకేలకు ధరాపాలకుండు బాలకు నీయఁ గృతనిశ్చయుండై యుండునంతలో నాలస్యంబున కోర్వమి రోషారుణలోచనుండై కౌశికుండు నరపాలుం గనుంగొని కటుంబు లదిరివ నిట్లనియె. 99

ఉ. ఏల విచారమున్ సలిపె ♦ దిందుమతీసుత ! నాకు దీక్షకుం
గాలము చేరువయ్యెఁ జనఁ ♦ గావలె నేదియొ తెల్పు, మేధరా
పాలకు నేని వేఁడెదఁ బ్రి ♦ పంచము సర్వము గొడ్డుపోయెనే !
యేలఁగ లేవుపో, తిరిప ♦ మెత్తికొనంగను నూళ్లు లేవొకో ! 100

ఉ. సాగరమట్టి దీవివమ ♦ సంసృతి, దుఃఖము లిందు నోమహా
భాగ ! తరంగమాలికల ♦ భంగిఁ జెలంగుచునుండు, నెప్పు డే
దో గనుపించు, దానిని బు ♦ ధుండు గణింపఁడు, నిస్తరంగమై
సాగర మాఁగు టెప్పు డిఁక ♦ స్నానమొనర్చుట యెప్డు భూవరా ! 101

మ. అఖిలంబున్ నృపుఁడౌటచేఁ బ్రిజకు మా ♦ యాకష్టముల్ నీదు స
మ్ముఖమందుం బ్రికటించినాఁడను, సుఖ ♦ మో్మ ! దుఃఖమో యేల యీ
నశిసంలూనము, లేల యీమునుఁగులో ♦ నం గుబ్రిద్దులాటల్, ముఖా
ముఖి నేదో వచియించి పంపుము ఫల ♦ మో్మ ! కాయమో పోయెదన్. 102

వ. అని యాసనంబుననుండి చలించినవాఁడై గమనోన్ముఖుండు గానున్న గాధినందను వారించి తత్పార్శ్వసింహాసనాసీనుం డగుమైత్రావరుణుండు నృపు నుద్దేశించి శిష్యస్వాతంత్ర్యంబున నిట్లనియె, 103

సీ. సంపదలా ? క్షణ ♦ క్షణభంగురంబులు!, విభవమా ? వాతాభ్ర ♦ విభ్రమంబు !
భోగంబులా ? నభః ♦ పుష్పోపమంబులు!, జవ్వనమా ? నదీ ♦ రయసమంబు !
కాయమా ? బహువిధా♦పాయభూయిష్ఠంబు!, సంసారమా ? యూర్మి ♦ చంచలంబు!
ఆయువా ? భిన్నకుం ♦ భాంతర్జలాభంబు!, సంతోషమా ? తటి ♦ త్సన్నిభంబు!

గీ. ఇట్టియస్థిరసౌఖ్యంబె ♦ యెద దృఢమ్ము, గాఁ దలంచి, కులక్రిమా ♦ గతయశమ్ము
గడియలో నిట్లు గంగలోఁ ♦ గలుపఁజన్నె ? వసుమతీనాథ! నీయంత ♦ వానికహహా!

మ. తొలుతన్ గోరినదెల్ల నిత్తునని యే ♦ దో పల్కి, యాతండు పు
త్త్రిలఁ గోరంగనె, యిప్డు తప్పుకొనుసె ♦ త్తుం జూతువా ? యీతపో

జ్వలనానన్యవిలోకనార్హు: డగు వి ♦ శ్వామిత్రుతోనా బలీ
చెలగాటంబులు ? పుత్రు నిచ్చి యిఁక నా ♦ శీర్వాదముం బొందుమా. 105

చ. అరయవుగాక గాధిసుతుఁ ♦ డన్న నొకానొకమానిమాత్రుఁడా !
నిరుపమబాహుసత్త్వుఁడు, తృ ♦ ణీకృతధాతృపురందరుండు, భా
స్కరుఁడు తపించు నాతఁడలు ♦ గన్, గులగోత్రము లల్లలాడు, భూ
వర ! పలుమాట లేటికిఁ బ్రి ♦ పంచము పంచతనొందు వేగ్రిల్మిడిన్. 106

ఉ. దానముకోసరమ్ము తమ ♦ తావున కీతఁడు వచ్చెనొక్కొ యా
మానవభర్తు లీఘనుని ♦ మార్కొనుచుంతటిపాటివారలా ?
మానవనాథ ! యేల యను ♦ మానము, మేలు ఘటిల్లు నీకు, వ్యా
ఖ్యానములేల, చూచెదవు ♦ గా ? కొమరు న్మని కిచ్చి పంపుమా. 107

చ. కనుటకెకాని తీని కధి ♦ కారము పుత్త్రులయందు వారిదౌ
యనుభవ మెల్లెడన్ బ్రిజల ♦ యందె చెలంగుచునుండుఁ జూడుమా
వనములయందు పెద్ద ఫల ♦ వంతమయయ్యు ఫలంబు నొక్కడేఁ
దినునె మహీరుహంబు ? పర ♦ దేశుల కిచ్చునుగాని భూవరా ! 108

మ. అకృతాస్త్రుండొ ! కృతాస్త్రుఁడో ! యగుసుతుం ♦ డామాట నీకేల యా
సకలంబుం గని చక్కఁబెట్టుటకు వి ♦ శ్వామిత్రుఁ డున్నాఁడు నీ
సుకృతం బింతకుఁ బండె, వాని సఫలా ♦ ఘం జేయు, వేఱొక్కమా
ఱఁక నీగాధిసుతుండు ని న్నిటుల “ దే ♦ హీ ” యంచు యాచించు నే ? 109

ఉ. బాలుఁడు వీఁడు, రావణుఁడు ♦ పంపినబంటులు వారు, వారికిం
జాలునొ, చాలఁడో యనుచు ♦ జంకెదు; సింగపుఁ బిల్లయేనియున్
జాలదె దానవద్విరద ♦ జాలము మాపఁగ ? నెంత కావలెన్
దూలమహీధరంబులను ♦ దూలఁగఁ జేయఁ గృశాను వక్కటా. 110

ఉ. కాదనఁ బోకుమయ్య ! తగు ♦ కాలము రావలె, లేద దెన్నినా
ళ్ళో దశకంఠకంఠహరి ♦ లుంఠనకోవిదుఁ డీమహాత్ముఁ డీ
శ్రీదయితుండు విష్ణువు, వి ♦ శేషము లేటికి ? లక్ష్మణుండు శా
కోదరనాథుఁ డిర్వుర నృ ♦ పోత్తమ ! తోడుగఁ జేసి యంపుమా. 111

క. పసపుము జాగొనరింపక, మునితోడన్ బుత్త్రిరత్న ♦ ముల నాలస్యం
బును జేయు నెడల నత్కృతం, బును విషమై పోవుఁగాదె ♦ భూపలలామా ! 112

వ. అని యిట్లు వసిష్ఠుండు నయభయంబులఁ గలతెఱంగెఱుంగఁ జెప్పిన నా నృపాలుండును, భయభక్తు లుల్లసిల్ల వసిష్ఠవిశ్వామిత్రులం బరికించుచు మెల్లన నిట్లనియె—— 113

ఉ. దానము సేయుచో నుభయ ♦ తారకమై విలసిల్లఁగావలెం
గాని, యొసంగువానికిని ♦ గైకొనువానికిఁగూడ దుర్భరా
నూనతరప్రయాసముల ♦ నుం బొనరించి కలంచునేని, నా
దాన మొనర్చి యేమి ఫలి ♦ తంబగుఁ? బేరు ప్రతిష్ఠ లుండునే? 114

క. నిఖిలజ్ఞ! శాబ్దికులు తా, మఖిల మెఱింగియు నిమిత్త ♦ మద్ది వినాశో
న్ముఖమైనఁ గార్యకరణో, న్ముఖు లగుటకు సంశయింత్రు ♦ మొగి దీననెగా?

ఉ. క్రూరులు యామినీచరులు ♦ కుత్సితు లింద్రమహేంద్రజాలముల్
నేరుచువారు, వారిఁ గని ♦ నిల్తురె? జన్నముఁ గావ నేర్తురే?
వీరలు క్షీరకంఠు లర ♦ విందదళాక్షు లశిక్షితాస్త్రులం
చారయుచుంటిఁ గాని సుతు ♦ నంపఁగ సంశయ మేమి దేశికా! 116

గీ. సర్వము జయప్రదంబుగా ♦ జరిగెనేని, మాటలే లేవు మీకును ♦ మాకుఁగూడఁ
గాని కొంచెము హెచ్చుత ♦ గ్గైనయెడలఁ, దెగువ మిమ్మును మమ్ము నిం ♦ దించు జగము.

ఉ. పంచదశాబ్దముల్ గలుగు ♦ బాలుర నేగతి మూర్ఖునట్లు పం
పించెను ఘోరరాక్షసుల ♦ పీచ మడంప నృపాలకుండు, పం
పించెను బో, మునీంద్రులు వి ♦ వేకధనుల్గద! వారలేని వ
ల్దంచు వచింప రాదె యని ♦ యందురు వారును వీరు దేశికా! 118

ఉ. నందనులందుఁ గూర్మివల ♦ నం దనుజన్ములఁ బంపలేక, యీ
చందముఁ బన్నెఁ బో నృపతి ♦ చంద్రుఁ డటంచుఁ దలంతురేమొ, నా
కెందుల కిద్ది, భావిగతు ♦ లెల్ల నెఱింగిన మీర కోరఁగాఁ
గందకు లేని యీ దురద ♦ గన్గొన బచ్చలికా? తపోనిధీ! 119

క. అని దౌవారికుఁ గన్గొని, జననాథుఁడు రామచంద్రు ♦ సౌమిత్రిని దో
డ్కొని రమ్మనంగ వాఁడును, జని వచ్చెడు వేడ్క నాత్మ ♦ జన్ములతోడన్.

ఉ. వారలఁ జేతఁబుచ్చుకొని ♦ వారిజబంధుకులుండు, కౌశికుం
జేరి ప్రదక్షిణంబులను ♦ జేసి కరద్వితయమ్ము మోడ్చి, నా
నేరము సైఁచి పుత్త్రుల ము ♦ నిప్రవరా! గొనుమంచు వేనమ
స్కారము లాచరింప, ముని ♦ సత్తముఁడున్ గుతుకాంతరంగుఁడై. 121

క. మణిఖచితదివ్యభూషా, గణములతో నెదుటనిలువఁ • గా రాముని ల
క్ష్మణుఁ గాంచి కౌఁగిలించెన్; క్షణకోపులుగారె మౌని • సత్తము లెందున్ ?

వ. అంత నమ్మునీశ్వరుం, డో మహీశ్వరా! యే మధ్వరావనార్థము భవత్సుతాపేక్షాకాంతుల మగుటం జేసియు, నీవును గానకకన్న సంతాన మగుటచే యాగరక్షణ ప్రేక్షణపరాఙ్ముఖుండ వగుటం జేసియు, నియ్యర్థమ్మునం గొంత నిష్ఠురముగాఁ బలుకవలసె, నయ్యది నీమనంబున వేఱుగాఁ దలంపఁబోకు, మదియునుంగాక, 123

మ. చిరకాలమ్ము తపించి పుత్త్రకుల కి • ష్టింజేసి యామీఁద న
ల్వర నీవార్ధకమందుఁ గాంచి యిపు డా • లోచింపకే మాకు న
ధ్వరముం గావఁగఁ బుత్త్రి నీయఁదలఁతే • ధాత్రీశ! సామోక్తులన్
జెఱకా! బెల్లముఁ బెట్టుమన్న నిడునే • చే నీత మర్దింపమిన్. 124

గీ. సవనసంరక్షణము పుణ్య • జనకమగుట,దానికి భవత్సుతుం డర్హ • తముఁడునగుటఁ
జేర్చి నిన్నింత బలవంత • పెట్టవలసెఁ, గాని, మదిలోన వేఱుగాఁ • బూనకయ్య.

గీ. ప్రాణములకంటె నెక్కుడై • పరఁగు రాము, నంపుటయెకాక, లక్ష్మణు • నంపినావు
కలదె ? నీయీవి, నీయట్టి • ఘనునిచేత, వసుమతీనాథ! తరియించు • వంశ మెల్ల.

ఉ. ఐందువతేయ ! కోరిక క • నంతగతిన్ గయి సేయుటొప్పు మీ
యందున, మీదు తాత యల • కాధిపుఁ జేయఁడె కౌత్సు నాఁడు ? సం
క్రందనతుల్య ! కాని యిఁకఁ • గౌత్సునిబోలెడువాఁడ నేను గా
నందుల కాత్మయందు వెత • నందఁగనయ్యెడు మాటిమాటికిన్. 127

వ. అని చింతాదంతురితాంతరంగుండునుంబోలె నటించుచు దారకద్వయము తోడ, గమనోన్ముఖుండు గానున్న యామునీంద్రు రాజేంద్రుం డవలోకించి, 128

క. నాకన్నులు నాభుజములు, నాకుం బ్రాణములు వీరు • నరనుత! మరలన్
నాకొసఁగి నిలుపు కరుణా,లోకమునన్ నన్ను జీవ • లోకమునందున్. 129

వ. అని దీనముగాఁ బలుకు నారాజేంద్రునకు ధైర్యంబుగాఁ గాలయాపన మభినయించి, 130

గీ. అధ్వరంబునకున్ దక్షి • యారె; దీక్షఁ,బూనఁగావలె సెలవిమ్ము • పోయివత్తు
లబ్ధకల్యాణులౌచుఁ జె • లంగుసుతుల, శీఘ్రకాలంబులోనె చూ • చెదవుగాక !

వ. అని యవ్వారలఁ దోడ్కొని కౌశికుం డరుగుచుండ నాతఁడు నెమ్మనంబున, 132

గీ. కష్టమౌఁగాక, సుఖమౌను • గాక, సుతులఁ, బంపకుండిన మునికార్య • భంగమౌను
నిర్మలుం డితఁ, డితఁడె • నీయు మదికి, వేడ్క నేయుటయే పది • వేలు నాకు.

క. అని, యంతఃపురముఁ నిజ, తనయవిరహాజనితభరముఁ ♦ దగ నోదార్చఁ
జనియె నృపాలుం డటుపైఁ, జని రాప్తులు బంధుగులును ♦ సభ్యులు పేర్మిన్. 184

మణిగణనికరము

సరసిజభవముఖ ♦ సకలదివిషదా
దరనుతనిరుపమ ♦ తరనిజచరణా!
చరణనఖరరుచి ♦ సముదయవళితా
మరముకుటఘటిత ♦ మణిగణనికరా! 185

పంచచామరము

సరోజబాంధవాన్వవాయ ♦ శర్వరీనిశాకరా!
కరాంబుజోల్లసన్నిశాత ♦ ఖడ్గఖండితాసురా!
సురేశముఖ్యగీతసద్య ♦ శోరమాధురంధరా!
ధరానుతార్థఖండితేందు ♦ ధారితద్ధనుర్వరా! 186

ఇది.............................................శ్రీ శ్రీర్ణపరిజ్ఞకవి విరచితం బగుశ్రీరామకళ్యాణంబున ద్వితీయాశ్వాసము.

---



శ్రీహయగ్రీవాయ నమః

# శ్రీరామకళ్యాణము

## తృతీయాశ్వాసము




శోభితాఖిలాంగా!
కౌశికసవనావనప్ర ♦ కాండబలా! వా
గీశమహేశసురేశ, ధ
నేశాదిసమస్తదివిష ♦ దీడితచరితా!

వ. దేవా! యవధరింపు, మివ్విధంబున నవ్విశ్వామిత్రుండు దారకద్వయముతో దశరథు వీడ్కొని యాశ్రమాభిముఖుండై యరణ్యమార్గముంబట్టి పోవుచు సార్ధయోజనదూరం బరిగి సరయూదక్షిణతీరంబున నక్కుమారులం గని, 2

ఉ. మారునిబోలునట్టి సుకు ♦ మారు లిసీ, వడ దాఁకి దప్పి గొ
న్నారలు మోము చూచినఁ గ ♦ నంబడు వాడినరీతి, వేళ కా
హారము లేక డస్సి యడు ♦ గైనఁ గదల్పఁగ శక్తి లేకయు
న్నార లటంచు నెంచి రఘు ♦ నాథునితో మునినాథుఁ డిట్లనున్. 3

చ. నరవర! యప్పుడే బడలి ♦ నాఁడవు, చూడఁగ నావగింజలో
నఱసగమేనిఁ బోము మన ♦ యాశ్రమవాటికకున్, క్షుధాతృషా
భరమున కాఁగలేవయితి ♦ బాలుఁడ వెప్పుడు రావు, నేఁటి కీ
పరిసరమందు నుందము ప్ర ♦ భాతము వచ్చినఁ బైన నేఁగనౌ. 4

క. కావున నీలో సరయూ, శైవాలిని కేఁగి మీరు ♦ స్నానక్రియలం
గావించి రండు క్షుత్తృ, డ్వ్యావర్తకము లగుమంత్ర ♦ వరముల నిత్తున్. 5

చ. అరుగఁగవచ్చు నామడల ♦ కామడలేని శ్రమంబు లేదు, వ
త్సరముల దాఁక నేమియు మె ♦ సంగక యున్నను బాధ లేదు, ని

బ్బరము బలంబు సాహసముఁ • బ్రౌఢిమ వీని జపించువారు పొ
యరు, సకలంబునుం గరత • లామలకం బగు వీనిచే నృపా! 6

క. బల యని యతిబలయని, భూవలయంబున వీని జనులు • వాకొందురు క్ష్మా
తలనాథ! యివ్వి శ్రీయః, ఫలమూలంబులును, బద్మ • భవమూలంబుల్. 7

క. మతి నిలిపి మందుఁడేనిం, జతురత వీనిఁ జపంబు • సలిపినచో, గీ
ష్పతియో! వాగ్బింబోష్ఠి, పతియో! భుజగేంద్రలోక • పతియో! గాఁడే. 8

క. మది నేమిగాఁగఁ దలఁచితొ, సదయాంతఃకరణ! బాహు • జన్మల కివి, దు
ర్మదదుర్వారప్రధనభూభృ, ద్భిదురమ్ములమాడ్కి, నాజిఁ • బెంపొనఁగూర్చున్. 9

ఉ. ఈ కరణిం దపస్వి వచి • యించినవాక్యము విన్నతోడనే
యాఁకలి, దప్పి, దుర్బలత • యంతయు నప్పుడె మాసిపోయిన
ట్లై కనిపింపఁగా, సరయు • నంతికముం జని స్నానసంధ్యలన్
వీఁకమెయిం బొనర్చి, రఘు • వీరుఁడు దమ్ముఁడుఁ దాను నిష్ఠతోన్. 10

వ. అట్లందుఁ గృతావగాహుండై, దురవగాహంబులైన యబ్బలాతిబలల గురు సమ్ముఖంబున నేర్చుకోఁ దలంచి వచ్చిన, నాచార్యుండును దన్మనోగతం బెఱిఁగినవాఁడై యవ్విద్యలఁ బ్రసాదించినఁ, దత్క్షణాపగతక్షుత్పిపాసులై, యారాత్రి తానును గురుండును దమ్ముఁడు నందె తృణశయ్యల శయనించి ప్రభాతంబగుడు మేల్కని— 11

సీ. శ్రీభగీరథరాజ • సింహప్రతిష్ఠాఢ్య, తపనవంశ్యయశఃప • తాక యనఁగ
సర్వంసహాంభోధి • సంభవాంగాంచితో, దారవర్తికకంఠ • హార మనఁగ
నిర్ఝరాకృతిబహి • ర్నిర్గతాఖిలమర్త్య, పూర్వజన్మార్జిత • పుణ్య మనఁగఁ
గైవల్యదుర్గమా • గాధమహాసౌధ, భాసురదివ్యసో • పాన మనఁగఁ

గీ. దనరి యభ్రంకషాదభ్ర • తరతరంగ, మాలికాడోలికారాజ • మానవిమల
పరమహంస శ్రియం బౌచుఁ • బరఁగు దానిఁ, గనుఁగొనిరి వారలపుడు గం • గాభవాని.

క. కించిన్మీలితనిజనే, త్రాంచలులై భక్తిచిత్త • మం దధికంబై,
మించం గీర్తించిరి ముని, పంచాననుఁడును నృపాల • పంచాననులున్. 13

శా. రంగారంగ భవత్సమీపమును జే • రంగా జనుం డెట్టిదు
స్సంగుండేని క్షణంబులోన నఘని • స్సంగుం బొనర్పింగతు వే
భంగంబుం గొననీవు మున్గియు మహా • భంగాళిలో నీవు నీ
గంగం దేలెడివాని భవ్యగుణసం • గా! దివ్యగంగానదీ! 14

శా. ఏయేజాడ్యము లేని నీసలిల మెం ♦ తేఁ దూరించుఁ బో యౌషధ
ప్రాయంబై, విమతప్రజార్తిభరముల్ ♦ భంజింపఁగాఁ గానిచో
వాధుగ్రిం డొకరిం దలక్ నిలుపువాఁ ♦ డా? “ఔషధం జాహ్నవీ
తోయం” మన్నజనోక్తి తప్పునె? నమ ♦ స్తోమంబు భాగీరథీ! 15

క. హరిపాదపద్మమందున, సరవిన్ జననంబుఁ గాంచి ♦ సర్వజ్ఞుండౌ
హరుశిర మెక్కితి, నీగుణ, గరిమం బేర్కొనఁ దరంబె ♦ గంగాజననీ! 16

క. అని యిటు గంగాస్తవా, లినిఁ బొగడుచు నంగదేశ ♦ లీలల నెల్లం
గనుఁగొనుచు మార్గమధ్యం, బున రాఘవు లంతరంగ ♦ మున ముదమందన్. 17

సీ. కామాశ్రమంబని ♦ గణుతింప సార్థక, నామ మందినపుణ్య ♦ ధామ మిద్ది
భూతాళితోఁ దపం ♦ బును సల్పఁగా వ్యోమ, కేశుఁ డుండినపుణ్య ♦ దేశ మిద్ది
అరివర్గమున కగ ♦ మ్యంబుగాఁ బద్మసం, భూతి చేసినతపో ♦ భూమి యిద్ది
ప్రతిఘటించి పినాక ♦ పాణితో మదనుండు, సిద్ధిఁ బొందినమహా ♦ క్షేత్ర మిద్ది
గీ. ఇద్ది ఫలవృక్షసాంద్రమై ♦ యెపుడు నెండ, యనఁగ నెఱుఁగనియట్టిమ ♦ హాశ్రమంబు,
గనుఁగొనుమటంచుఁ బోవుమా ♦ ర్గమునఁ బేరు, పేరునకుఁ జెప్పె మౌనిబృం ♦ దారకుండు.

వ. ఇబ్భంగి నయ్యంగదేశవిలాసంబులఁ గుతూహలాంతరంగులై విలోకించుచు వచ్చుచుండఁ, బ్రొద్దు గ్రుంకుటయు, నందున్న మునిజనంబులఁ గౌశికాంతేవాసు లగుటయు, నారాత్రి నిర్వృత్తసాయంకాలానుష్ఠానులై యంద నిద్రించి, మఱునాఁడు ప్రాతఃకాలంబున నమ్మువ్వురు జాహ్నవి నుత్తరించి వచ్చుచుండ—

సీ. జనము లేమిని బ్రిదో ♦ జనము లేని ధృతాభ్ర, మండలం బగుసౌధ ♦ మండలంబు
వాడుక లేమిఁ గా ♦ ర్చుడినట్లు దోఁచుజ, లాశయం బట్టి జ ♦ లాశయంబు
అనుభవించెడు వార ♦ లరుదౌటచే వృధా, సముదయం బగు ఫల ♦ సముదయంబు
మరల నెప్పుడు మరా ♦ మత్తు లేకణగారు, గోపురంబులు దాఁకు ♦ గోపురంబు
గీ. వెసఁగి నిర్జనమై యొప్పు ♦ నీపురంబు, దేపురంబొకో! యని లోన ♦ ధ్యాపరంబు
గాఁపురము సేయ రాముండు ♦ కౌశికాభి, ముఖుఁ డగుచుఁ బల్కె విస్మయో ♦ న్ముఖతఁ దోఁప.

చ. మునికులసార్వభౌమ! కన ♦ ముచ్చటయై, యసమానభోగభా
జనమయి యొప్పి, సౌఖ్య మిడఁ ♦ జాలియు నిర్జనమై యభాగ్యశ
స్తనముగతిం జెలంగు నిది ♦ దానికిఁ గారణమేమి? యిద్ది యే
జనపద? మంతయుం దెలిపి ♦ సంశయమున్ దుదముట్టఁ జేయవే. 21

క. నావుడు మునివరుఁ డిట్లను, భూవర! విన వేడ్క నీకుఁ ♦ బుట్టెంగానన్
నే వినిపించెద వినుమని, యీవిధిఁ జెప్పందొడంగె ♦ నితివృత్తంబున్. 22

చ. జననుత! యిందుఁ బాద మిడ ♦ జంకుదు రెట్టిరులేనిఁ దాటకా
వన మిది యొక్కవేళ బల ♦ వంతుఁడ నేనని సాహసించి చొ
చ్చిన నెవఁడేనిఁ బ్రాణ మఱి ♦ చేతనె యుండు నిశాటభీతిచేఁ
గనుఁగొను పెక్కులేమిటికిఁ ♦ గాకియు గ్రద్దయు నాడ దిచ్చటన్. 23

చ. ఘనతరమైన దాని పృథు ♦ కాయము మందరపర్వతంబు క
న్నను నొకయింత పెద్దగఁ గ ♦ నంబడు, భీకర ఘోరదానన
మ్మను నొకసారిఁ జూచిన య ♦ ముండు గిముండును బాఱిపోవుఁ దూఁ
చినగతి దానిదేహ మభి ♦ షేకముచేసినయగ్ని కీడగున్. 24

ఉ. కొండలు పాఱి రాచెనఁటి ♦ ఘోరతరాకృతిఁ జూచి, యిఱకనుం
గొండలు తత్క్షుధాగ్నికళ ♦ కుం గుఱియై శలభంబు లైరి, యే
మందును గొంతమంది నిల ♦ యంబుల వీడి పరారియైరి, గా
నం మద కొక్కమర్త్యుఁడయి ♦ నం గనిపింపఁడు దీనిచే నృపా! 25

క. మును మలదకరూశము లను, జనపదములు సర్వసస్య ♦ సంపన్నంబుల్
ధనవంతము, లివి, యిపు డొక, వనమయ్యెను నీనిశాటి ♦ వలన నృపాలా! 26

క. జను లిందు లేమి నిప్పుడు, మునియాశ్రమములకుఁ జేర ♦ మొదలిడె, నకటా
మునులను దినుటకు; నెందుం, దిన నేర్చిననోరు కట్టుఁ ♦ దీరునె నృపతీ! 27

శా. రాణన్ జన్మములేల మీకు జడులా ♦ రా! యెందు కీద్రావిడ
ప్రాణాయామము, చుట్టుదారి యిది గీ ♦ ర్వాణాలయం బేఁగ; ని
ర్వాణం బెప్పుడు మీకు, నీసులువుఁ ద్రో ♦ వం బొందు నిస్త్రింశకా
స్థాణంబే దివ మిచ్చు మీకు నను నీ ♦ దుష్టాత్మ యజ్ఞంబులన్. 28

ఉ. అంగము నొక్కప్రోద్దనుచు ♦ నక్కటు మాడ్చుచు, నాత్మహత్య చే
యంగను బున్నె మున్నె! యఘ ♦ మబ్బుఁ జుఁడీ పయి పెచ్చు, పెంచుఁ డే
భంగము లేక యంగముఁ గృ ♦ పాణమిదే యిఁక మీకు ముక్తి మా
కుం గడుఁదృప్తి నిచ్చు నని ♦ కూయిడు నియ్యది యాశ్రమంబులన్. 29

క. స్వారాజు మీమఖంబుల, కారూఢానందుఁడగుచు ♦ వంపినకుసుమా
సారం బని కుఱిసెడు నసృగ్ధారల నగ్నులను వర్ష ♦ ధారలపగిదిన్. 30

క. ఆ యసురజనని కనుఁగొను,మా ! యొకఁడన నేల సాధ్య ♦ మగుచో, మాకుం
జేయని కీడును, విఘ్నము,చేయని యజ్ఞంబుఁ గలదె ♦ క్షితిపాలమణీ ! 31

క. నిటలాక్షతులితు, లఘటిత, ఘటనాపటు లంచుఁ జంపఁ ♦ గడఁగదుగానీ
యటుగానిచో క్షణంబే, నిటఁ బ్రాణముతోడ నిల్వ ♦ నిచ్చునె మమ్మున్ ?

క. భయదాకృతియై, మాకున్, నయనంబుల్ కట్ట ! మూసి ♦ నం, దెఱచిన ని
ద్దిరయె గానిపించు, వినుమం,తయుఁ జల్లకు వచ్చి యుంత ♦ దాఁచఁగ నేలా ! 33

గీ. ఈపురముదుర్దశల రూపు ♦ మాపుటకును, బెరిమ మాజన్నములఁ జక్కఁ ♦ బెట్టుటకును
ఈయసురనంతకాతిథిఁ ♦ జేయుటకును, గాదె నినుఁ గొనివచ్చితి ♦ మేదినీశ ! 34

చ. అని వచియించి గాధిసుతుఁ ♦ డల్లదిగో ! యొకక్రోసుదూరమం
దున నివసించుఁ బుత్త్రికుల ♦ తో నలతాటక, యొక్కసాయకం
బున శతధార వాసవుఁడు ♦ భూధ్రనికాయము నేసినట్లు దా
నిని దెగ నేసి నల్దెసల ♦ నిర్మలకీర్తిశశాంకు నిల్పుమా. 35

క. అని మౌని పల్క, స్త్రీవధ, జనితాసహ్యతయు వదన ♦ సరసీజంబం
దునఁ గానిపింప నీగతి, మనమునఁ దలపోయఁదొడఁగె ♦ మహినాథుఁ డొగిన్. 36

ఉ. స్త్రీవధ పాతకం బనుచుఁ ♦ జెప్పుచునుందురు పెద్ద లక్కటా
యీవిషయం బెఱుంగఁడొకో ♦ యీవిధి కే విధి సమ్మతించెడుం
గోవిదుఁ ! డీతఁ డిట్లనుట ♦ కుం గత మేమయియుండు ? దీనిలో
భావము గానరాదు, పొర ♦ పాటు మునీశులకున్ ఘటిల్లునే ? 37

గీ. గురునివాక్యంబు మీఱఁగాఁ ♦ గూడ దండ్రు
స్త్రీవధముఁ బాతకం బని ♦ చెప్ప చుండ్రు
రెండు నేకత్ర దృష్టమై ♦ యుండె నిప్పు
డేమిసేయుదు నింక నా ♦ కేమి తెరవు ? 38

చ. గురునిమనోరథంబు సమ ♦ కూర్చెద మన్నను స్త్రీవధవ్యథా
ఖర మిటు మ్రొగ్గనీయ, దిది ♦ భారము పొమ్మని యూరకున్నచో
గురు నవమానమున్ సలుపు ♦ కూళుఁడ నయ్యెదఁ, గీడె మూఁడు నే
కరణిఁగ నున్న నిప్పు డడ ♦ కత్తెరలోపలి పోకకుంబలెన్ 39

క. అని పరిపరివిధముల నె,మ్మనమునఁ జింతిల్లుచున్న ♦ మనుజాధీశుం
గనుఁగొని మౌనీంద్రుం డే, యనుమానము లేక యిట్టు ♦ లనియెఁ గడంకన్. 40

చ. అరయఁడు నీమనోగతము ♦ నంతయుఁ జింత వహింపఁబోకయా
తరుణి గదా యటంచుఁ బెడ ♦ దారిని బోయితి వయ్యొ! యీ నిశా
చరి యిటు నింకఁ గొన్ని దివ ♦ సంబులె యుండినఁ జుట్టుఁబ్రక్కలం
బురములు నగ్రహారములు ♦ బూడిదగావె నృపాలచంద్రమా! 41

గీ. అసురపై దృష్టియున్న చో ♦ నణఁగు జగము, జగమె ప్రేమించినం జంపఁ ♦ జను నిశాటి
క్ష్మాపతివి నీవు కనుమా ని ♦ శాటిమారణంబు మేలో జగన్మార ♦ ణంబు మేలో!

క. రాజు వధానర్హుం డని, రాజులలోఁ దెలియునట్టి ♦ రాజుం గలఁడే,
రౌజమెయి వేఁటలో మృగ, రాజుల మన్నించుచుండు ♦ రా మీఱు నృపా!

క. పరహింసాపరులగు గడుఁ, గరుణాదూరుల నృపాల! ♦ గాతుర కీకాఁతో
దరములఁ గనిన "నహింసా, పరమో ధర్మ"యను మేటి ♦ పండితులైనన్. 44

చ. రణమున వెన్నుఁజూపక ప ♦ రాక్రమ ముల్లసిలంగ, దుష్టశి
క్షణమును శిష్టరక్షణము ♦ సల్పుట యుత్తమ మెందు క్షత్రియా
గ్రణులకుఁ గాన సర్వజన ♦ కంటకయై ఘనదుష్క్రియాపరా
యణ యగుదీనిఁ ద్రుంచి యిఁక ♦ నైనను మానులఁ గాచు టొప్పదే? 45

వ. అని యిట్లు మునినాథుండు పలుక రఘునాథుండు వినయవినమితాస్యుండై

చ. అతివలఁ జంపరా దబల ♦ లంచు మహాత్ములు మిమ్ముబోంట్లు స
మ్మతి వచియింప వాత్మ నను ♦ మానము మాటికి బాధపెట్ట నీ
గతి మది సంశయించితిని ♦ గాని మహాత్మ! యెఱుంగమొకొ, మీ
కత సకలమ్ము మీకు నవుఁ ♦ గా దనునంతటిపాటివాఁడనే. 47

శా. మీవాక్యంబును వేదవాక్యమునుగా ♦ మీచేయి మీఁచేయిగా
భావంబందున నిల్పి భక్తిరసమె ♦ ప్పన్ మీదు త్రైశంకవ
ప్రావీణ్యంబును లోకశాసనముఖుల్ ♦ పారాయణం జేయుచున్
గైవారంబొనరింతు రన్వహమునున్ ♦ గాధేయ! వేయేటికిన్? 48

శా. పాకారాతి త్రిశంకుఁ గ్రిందఁబడఁద్రో ♦ వన్ జూచి నాకేశుతో
దీకో నానృపతిం దపోగరిమ "మ ♦ ధ్యే తిష్ఠ" యం చందునే
నాకం బొంటి సృజించి నిర్జరుల బా ♦ దాక్రాంతులం జేయ భూ
లోకబ్రహ్మవు నిన్ను నెన్నఁగలఁడే ♦ లోకేశుఁడున్? కౌశికా! 49

గీ. ఇట్టి మీరు స్త్రీవధకాజ్ఞ ♦ యిత్తురేని, నేను దలవంచుకొని దాని ♦ నే గడంగి
నేయుదునయోని నెల్లరకీయుద్ధంత, మంతయు మునీంద్ర! గోచరం ♦ బగుటలేదొకో?

క. మీ రాడుదానిఁ గాదన, నోరాడునె సంశయంబు ♦ నుం గొను మెల్లన్,
మోఱకులుఁ గూడ, స్త్రీవధ, దారుణకృత్యం బటంచుఁ ♦ దలఁపఁగఁ గాదే. 51
క. ఇద్ధవి వేరులనుడి గుణ,విద్ధా! శాస్త్రములు గూడ ♦ వెంటాడుంబో
యిద్ధర భయమేటికి సం,సిద్ధోస్మి భవన్నియుక్తిఁ ♦ జెల్లించంగన్. 52
చ. అని యిటు మాటలందు విన ♦ యంబు నయంబు నెలఁగ, నార్తులం
దనుగతధర్మమందు నభ ♦ యంబు భయం బలరారఁ జూపునా
యనునయమార్గవంబునకు ♦ నచ్చెరువుం జెఱవాచుఁ బాఱఁగా
ముని నృపసూనువాణి కను ♦ మోదము మోదముఁ జూపి యిట్లనున్. 53
క. తెలియక యాథార్థ్యంబు న,బలయని పలుమాఱు దీనిఁ ♦ బలికెద వకటా!
యలఘుగుణార్ణవ! సత్య మ,బలయా మదకరిసహస్రి ♦ బల యిద్ది సుమా. 54
క. స్త్రీ యేనిఁ బురుషుఁడేని బ,లీయంబుగఁ గ్రూరులైన ♦ లింగవివక్షం
జేయక వారల లోక,శ్రేయంబగు పొంటెఁ దునుమఁ ♦ జెల్లు నృపాలా! 55
చ. ఇటు కుశికాత్మజుండు వచి ♦ యించుచునుండఁగ, నంత నాకరం
గటును మనుష్యులున్నటులు ♦ గాఁ బసివట్టి పదప్రఘుష్టనా
ర్భటి ధరణీతలాగ్రి మద్రి ♦ వన్ జనుదెంచి నిశాటి యెవ్వరి
కటకము నింత నిర్భయము ♦ గాఁ జనుదెంచెద రంచు నుద్ధతిన్. 56
చ. ఇలపయి జీవితేచ్ఛగల ♦ యెవ్వరు నివ్వన మేఁగుదేరఁగాఁ
దలఁపరు, వీర లెట్లొ పెడ ♦ దారిగ వచ్చిరి, నేఁడు వీరలం
దొలికబళంబుగా ముదము ♦ తోఁ దిననౌ నని, యా నిశాటి లోఁ
గిలకిల నవ్వుకొంచుఁ గడుఁ ♦ గేకలువెట్టుచు వచ్చునంతలోన్. 57
ఉ. దూరమునందె వకాని యతి ♦ దుష్టను దాఁటకఁ గాంచి దానియో
య్యారము దానిక్రూరతయు ♦ నంతయుఁ దప్పక పూసగ్రుచ్చిన
ట్లారఘురామునితోడ నని ♦ యాయుధపాణివి కమ్మటంచు, గం
భీరరవంబుతోఁ బలుక ♦ బీరముపోయి నృపాలసూనుఁడున్. 58
గీ. పయికి గంభీరముగనట్లు ♦ పలికెఁ గాని, లోన స్త్రీహత్య యిష్టంబు ♦ గానికతనఁ
దప్పికొన నెంతమాత్రంబు ♦ దారి లేమి, నుల్లమందున నిట్లు చిం ♦ తిల్లఁదొడఁగె.
చ. కటకట నాదుమూలకము ♦ గా నిఁక నేఁటికి సూర్యవంశ ము
త్కటదురితాంబురాశి మునుఁ ♦ గన్ వల పెంగద, నాదుతండ్రి యెం.

తటిదుతుకంబు గాంచెనో మ ♦ నంబున నన్ బోడఁగాంచి, యిప్పుడుం
తటి వెతఁ దెచ్చిపెట్టితిఁగ ♦ దా కొఱమాలినయీకొఱంతతోన్. 60

గీ. ఇప్పు డిటనుండి దివము రే ♦ పేగు మాకు, నకట యెటొ ప్రొద్దుపుచ్చంగ ♦ నగును గాని
కర్మములసాక్షియై కల ♦ కాలముండు, కులముసామికిఁ గష్టంబుఁ ♦ గూర్చినాఁడ.

క. మానవభక్షిణి వచ్చెడుఁ, గానున్నది కాకపోదు ♦ కాని మైమ్రనం
జేసైనవఱకుఁ జూచెద, మానసమం దింక నొండు ♦ మార్గం బున్నన్. 62

వ. అని యిట్లు కొంతతడ వాలోకించి 63

చ. పొలఁతిని జంపఁగా మనసు ♦ పుట్టదు, దేశికునాజ్ఞ మీఱఁగా
మలఁగదు చిత్త, మిందు కొక ♦ మార్గముఁ బన్నెద, నీనిశాటిచే
తులఁ దెగనేతు, దాన నిది ♦ దుండగముల్ పచరింప, దిందుచే
సలిపినవాఁడ నౌదు గురు ♦ శాసనమున్, హృదయప్రమోదమున్. 64

క. అని కరవాలము చేతం, గొని నిర్భయ మొప్ప నాని ♦ కుంజరుసవిధం
బునఁ గాలయమునిచందం, బున లక్ష్మణుతోడ రామ ♦ భూవరుఁ డుండన్. 65

చ. కనుఁగొని రామచంద్రు నొక ♦ కంట నిశాచరి, యేమివింత యీ
మనుజుఁడు నన్నుఁ జూచియును ♦ మ్రగ్గక స్రుగ్గక ఖడ్గ మొందు చేఁ
గొని నిలుచున్నవాఁ డనుచుఁ ♦ గోపము రూపముఁ దాల్పఁ దోఁకత్రొ
క్కిన భుజగంబు కైవడి నొ ♦ గిన్ గికురించి నృపాలు నిట్లనున్. 66

ఉ. ఎవ్వఁడ వివ్వనంబునకు ♦ నెవ్వనితోడుగ వచ్చినావు, దా
దవ్వులఁ బాఱుచుండు రిది ♦ తాటక యాశ్రమమంచు, నేమి నీ
క్రొవ్వు? ననుం గనుంగొనియుఁ ♦ గొంకవు జంకవు, నిల్వు మిప్డె నీ
క్రొవ్వడఁగింతు నిందుఁ గనుఁ ♦ గొందువుగాక మదీయసత్వమున్. 67

క. రక్కసులు కత్తిఁ గనుఁగొన, నుక్కడి పాఱుదురటంచు ♦ నూహించితివా
యెక్కడి వెఱ్ఱియొ బూచుల, కక్కట భూతములు భీతి ♦ నందునె చెపుమా? 68

క. సంత్రస్తుల నొనరిచి బా, ధింత్రిని రక్కసులఁ గలఁచు ♦ తేకువ ముని యీ
తంత్రముఁ బన్నెనుగానీ, మంత్రములకు రాలునొక్కొ ♦ మామిడికాయల్! 69

మ. అని ధట్టించుచు నానిశాచరి పృథు ♦ వ్యాకాశముల్ రెండుఁ దా
కునటుల్ కాయముఁ బెంచి సాధ్వసమ ♦ గ్రుంగ జేయఁగా రాము నా
వనమందున్ వివృతాస్యయాచుఁ గబళిం ♦ పన్ జూచుచున్, దత్క్షణం
బున బాణం బరి వోసి యేసె హృదయం ♦ బున్ రాఘవుం డుద్ధతిన్. 70

క. ఏలా చెరలాటము నరపాలా! సూర్యుండు గ్రుంక • వచ్చెను, సంధ్యా
కాలంబున రక్కసులకు, నోలిన్ బల మధికమందు • రుత్తమబుద్ధుల్. 80

క. అని యిట్లు మౌని పలుకుట,యును రక్కసి తన్ను మ్రింగు • నుద్దేశముతోఁ
జనుదెంచుటయును గనుఁగొని, జననాథుం డంత మదిని • సంభ్రమ మెసఁగన్.

ఉ. నారస మొండు దీసి, ముని • నాథుని మానసమందు నిల్పి, దు
ర్వారరుషాంచితుం డగుచు • రక్కసి పై విడువంగ, నద్ది త
త్క్రూరశిలీముఖవ్యథకుఁ • గూలె నిమేషములోనఁ, దన్ముఖ
ద్వారమునుండి కాల్వలవి • ధమ్మున రక్తము పాఱుచుండఁగన్. 82

క. దేవతలు పుష్పవర్షముఁ, గావించిరి మింటఁ గొందు • కంబున వేల్పుం
బూవుంబోఁడులు పాడిరి, భూవిభుని పరాక్రమంబుఁ • బొగడుచు నంతన్. 83

వ. ఇట్లు రాముండు తనచేఁ దాటక నిహత యగుటంజేసి స్త్రీహత్యాపాత
కంబు తన్నుఁ జుట్టుకొన్నట్లుగా భావించుచు, మునినైనం జూడఁజాలక యధో
ముఖుండై యుండునంత. 84

చ. అలమట పెట్టుచుం గుమల • యం బనయంబును దాపకారులై
మలమల జీవలోకముల • మాడ్చెడువా రెవరేని, నావలెం
బొలియుదురంచుఁ దెల్ప నృప • పుంగవు దుఃఖముఁ బాపనో యనన్
జలనిధిలోనఁ గ్రుంకె జల • జాతహితుండు హతప్రభావుఁడై. 85

శా. ఆకాశంబున బారుదీర్చుచు శకుం • తానీకముల్ పారె న
స్తోకశ్రీకమనీయమౌచుఁ గుముద • స్తోమంబు రాజిల్లె, సం
ధ్యాకాలంబని బ్రాహ్మణోత్తములు సం • ధ్యావందనాదిక్రియా
వ్యాకృష్టాంతరులౌచుఁ జేరిరి నదీ • ప్రాంతంబులం దంతటన్. 86

సీ. తపనబింబాపాత • దళితపాథోమార్గ, బహిరాగతాంభోధి • బాడబంబొ!
పశ్చిమాచలకూట • పరిణద్ధగైరిక, ప్రీతతిచ్ఛవిచ్ఛటా • ప్రసరణంబొ!
రాజదర్శనసము • ద్వేజితాపరహరి, ద్రిమణీవిలిప్తాంగ • రాగరుచియొ!
సాయంవియోగార్త • చక్రవాకీమనో, వీథీపరాపత • ద్విరహాశిఖియొ!

గీ. అప్సరస్స్నానగళితలా • క్షాదిరాగ, సంకులత్క్రించిదరుణని • ర్ఘరఝరంబొ!
యనుచు జను లూహసేయంగ • నంతొ నాక, సంబునందున సంజకెం • జాయలొప్పె.

చ. సమయము పేరిపూరుషుఁడు • శాత్రవుఁ డౌ రవి యస్తమించుటన్
దమకముతోడఁ జెల్ప నది • తథ్యమొ కాదో యెఱుంగుకోర్కితో

నెమకఁగనో యనంగ, ధర ♦ ణీధ్రగుహాగ్రమునుండి యంధసం
తమసము లంతటన్ బరఁగె ♦ ధారుణి యీనినభంగి నంతటన్. 88

సీ. పరిధావనేతరే ♦ తరయోగపశ్చాత్త్వ, తజ్జనాకీర్ణర ♦ థ్యాతలమ్మ
వటుదర్శముజ్జ్వల ♦ జ్జటిలపిశాచికా, భ్రమవిద్రవత్పాంథ ♦ సముదయంబు
సాంబోధనికవచ ♦ స్స్వామ్యాయమయమితి, ప్రత్యభిజ్ఞాకృత ♦ ప్రతివచంబు
దండతాడనరవే ♦ తఃప్రయాతేత్యూహ్య, మాణవృద్ధద్విజ ♦ మండలంబు
గీ. నగుచు ధారుణినెల్ల మెం ♦ డైతిమిరము, మిన్నె కాటుక వర్షించు ♦ చున్నదనఁగ
నంధతమసంబె యిటుసమ ♦ స్తాంగములను, బూయుచున్నదియోయనఁ ♦ బొలుపుమీఱె.

ఉ. లోకులకండ్లు మూసి పెను ♦ లోభముచే నకటా! దిగంగనా
స్తోకవిలాససంపదల ♦ దొంగిలె సంతమసంబు నాప్రభు
త్వాకలనంబునందె యిటు ♦ లాయెనుగా! యని, యిర్ష్యమూఁకఁ జీ
కా కొనరింపనో యనఁగ ♦ నంతట రా జుదయించెఁ దూర్పునన్. 90

సీ. గిరిమస్తనిర్ఝరముల ♦ క్రియ జారిణీస్త్రీల, యాశాప్రవాహంబు ♦ లంతరించె
గర్భదరిద్రుల ♦ కాంక్షితంబులమాడ్కి, మున్నీటియూర్ములు ♦ మిన్నుముట్టె
అతిసముచ్ఛ్రయ మతో ♦ గతికె యన్నటు మించి,తమమెల్ల నంతలో ♦ సమసిపోయె
సత్పాత్రదానంబు ♦ చాడ్పుఁ జంద్రికలు స,ర్వభ్యుచ్చయోత్తరముగాఁ ♦ బెచ్చు పెరిఁగెఁ
గీ. కైరవంబులు వికసించెఁ ♦ గలువ తేనిఁ, గనఁదగదటంచు నేమొ ప ♦ ద్మములు మోము
వాంచె,జక్కవ లడలె,దం ♦ పతులు మోద, వారినిధిలోనఁ గ్రుంకె మీఁ ♦ దైరియపుడు.

సీ. నాకధునీపుండ ♦ రీకమంచుం బూవుఁ, దేనెకై వచ్చిన ♦ తేటి యనఁగ
శివుఁడు చక్రమునకుఁ ♦ జేసిన గండిమై, దీపించు గగనదీ ♦ ధితి యనంగఁ
బ్రాగంగనాముఖ ♦ పద్మంబు ముద్దాడు, పట్టానం దగిలిన ♦ బొట్టనంగఁ
దమమునంతయు దిగఁ ♦ ద్రావుటచేలోనఁ, గనిపించు కటికచీఁ ♦ కటి యనంగ
గీ. గురుసతీగమనం బను ♦ ఘోరపాప, మహిమచేతను నేర్పడ్డ ♦ మచ్చ యనఁగఁ
గనఁగొనఁగనయ్యె నప్పు డ ♦ క్కమలవైరి, మేనియం దింద్రనీలంబుఁ ♦ బోనినలుపు.

ఉ. కాలమునుండు కూకుదుఁడు ♦ గా నిఁక సాంధ్యరుగగ్ని సాక్షిగా
నోలిని మింటనయ్యెడు వి ♦ ధూద్వహనోత్సవమందు నల్లజ్యో
త్స్నాలలితాంగి, చందురుని ♦ శీర్షమునం దిడు ముత్తెపుంపలం
బ్రాలనఁ బొల్చె నంతట న ♦ భస్స్థలమందునఁ దారకౌఘముల్. 93

సీ. తటఘట్టనోత్థిత ♦ తఃపతితంబులై, పొలుచుమిన్నేటితుం ♦ పురు లనంగ
విష్ణుపదంబైన ♦ వినువీథి వేల్పు లం, దంబుగా నిడినకుం ♦ దంబు లనఁగ
నటనక్రమంబుచే ♦ నటరాజు వినుమేనఁ, గనిపించు ఘర్మాంబు ♦ కణము లనఁగ
వటుత్రివక్రై వేల్పు ♦ వడ్రంగి యులిచేతఁ, దొలచిన రేవెల్గు ♦ తునక లనఁగ

గీ. అంబరము పేరి రత్నాప ♦ ణంబునందుఁ, జౌకగా నమ్మఁబఱచువ ♦ జ్రంబులనఁగ
నేత్రపర్వంబొనర్చుచు ♦ నింగియెల్ల, మిణుకు మిణుకంచుఁ జుక్కలు ♦ మెఱసెనంత.

వ. ఇట్లు రాత్రి చనుదెంచుటయు నగ్గురుశిష్యులు మువ్వురు సాయంకాలోచిత కర్మముల యథావిధిగా నిర్వర్తించి, యచ్చటి కనతిదూరంబునఁ దృణశయ్యలఁ బ్రత్యేకంబు గావించుకొని నిదురించునంత 95

సీ. సానవెట్టినమంచి ♦ జాతిరత్నపుముక్క, తెల్లవారు నటంచుఁ ♦ దెల్పు డక్క
సోమరిపోతుల ♦ సొలయించుతలత్రిక్క, యిండ్లదోపిడికాండ్ర ♦ కెదురుచుక్క
జ్యోతిర్విదుల ఖనా ♦ చులఁజేయు వెనురిక్క, తొగఱేనిపాలింటి ♦ తోఁకచుక్క
తేజఃప్రరోహాసం ♦ దీప్తికిఁ దొలియిక్క, యంధసంతమసంబు ♦ నణఁచుమొక్క

గీ. ప్రొద్దునసె లేచి పయనమై ♦ పోవుబాట, సారులకు నెల్ల మూఁడవ ♦ జాము లెక్క
జక్కవలచిక్కుఁదీర్ప మి ♦ ణుక్కురనుచు, వెలసెఁదూరుపుదెస నంత ♦ వేగుఁజుక్క.

ఉ. శ్రీ యలరారఁ దారకల ♦ చేఁ బరివేష్టితుఁడై త్రియామము
బాయకగూడి నైజరుచిఁ ♦ బాసి విరక్తతఁ బాండురోగియై
పోయె ననంగ వెల్లనయి ♦ పోయె నిశాకరుఁ డంతఁ గుక్కురో
కోయని కూసె నిండ్లపయిఁ ♦ గుక్కుటముల్ ద్విజులెల్ల మేల్కొనన్. 97

సీ. ఎడఁబాటు నోర్వక ♦ మడయనున్ననిజేశు, క్షణ మాగుమని నొక్క ♦ చక్రవాకి
తెలివాఱవచ్చె నీ ♦ పొలయల్క విడుమంచుఁ, గికురించెఁ బ్రాణేశు ♦ నొకచకోరి
ఆర్ద్రపరినూత నా ♦ థా! విడిచనకంచు, నుసిపోవఁ బలి వేఁడె ♦ నొకవిహంగి
సంజఁదమ్మింజిక్కి ♦ జడిఁజెందుపతికి కు, క్రోదయం బెఱిఁగించె ♦ నొకమడంఘ్రి

గీ. పక్షముల వీచిమేల్కొల్పి ♦ ప్రాణనాథు, నికటమునను సుఖించెఁ గొం ♦ డొకమరాళి
యేమిచెప్పుదు నన్నింటి ♦ నీవిధంబు, వేగిరంపడఁ జేసె న ♦ వ్వేగుఁజుక్క. 98

వ. ఆసమయంబున 99

సీ. మందాకినీసార ♦ విందగంధాయాత, మందమందానిలా ♦ స్పందనముల
సాలసుప్తోత్థిత ♦ శారికాకీరికా, కలకంఠకాకలీ ♦ కలకలములఁ
గోకారికరసమా ♦ ఘౌకాంతరాళాభి, షేకీకృతహిమాంబు ♦ శీకరముల
అంతికాక్రమహాని ♦ సంతానకాత్యంత, సంతోషకృతశాస్త్రి ♦ చింతనముల

గీ. మేలుకొని గాధిపుత్రుండు ♦ బాలకులును, గాల్యకృత్యంబులను దీర్చి ♦ కడఁకతోడ
స్నానసంధ్యాద్యనుష్ఠాన ♦ సత్క్రియలను, సలుపఁ బరిసరతటినికిఁ ♦ జనఁగ నంత.

ఉ. మానక యామినిన్ విరహి ♦ మారణచే జనియించుపాపసం
తానము క్షాళితంబుగ నొ ♦ నర్పఁగనో, ద్విజరాజు గావునన్
బూనికఁ బ్రాతరాహ్నికముఁ ♦ బూర్తియొనర్చుట కోసమొక్కొ ? తా
స్నానముఁ జేయఁబోయెననఁ ♦ జంద్రుఁడు గ్రుంకెను బశ్చిమాంబుధిన్. 101

చ. కమలవిరోధి యీపగిదిఁ ♦ గాలవశుండయి యబ్ధిఁ గ్రుంకుడున్
రమణుఁడు పోవఁ గల్గినవి ♦ రాగముతో, బ్రతు కేటికంచు దాఁ
గుముదిను లెల్ల నీరమునఁ ♦ గూలెను, దారలుఁ బుష్కరంబునన్
గ్రమముగ నంతరించెఁ, బతి ♦ గామినులేకద ! యెందుఁ గామినుల్ ! 102

చ. అనయము లోకబాంధవుఁడ ♦ నై యలరారెడునాదుభార్యఁ బ
ద్మినిని నిశాంతవేళఁ దన ♦ మేటికరంబులఁ దాకి యంటుఁ జే
సెను విధుఁ డంచుఁ బెన్గినుక ♦ చే నటు రోషకషాయితాస్యుఁడై
దినమణి వచ్చుచుండెనని ♦ తెల్పెను నంతఁ బ్రభాతరాగముల్. 103

సీ. వినయవిహీనుని ♦ విద్యలంబోలె దీ, పంబులు దీప్తిహీ ♦ నంబులయ్యె
శబ్దానభిజ్ఞుని ♦ సాహితివలెఁ దమ, స్సమితి "పదే పదే" ♦ స్ఖలితమయ్యె
మరణోన్ముఖున కిచ్చు ♦ మందులగతి మత్ప్య, లంబులు కాంతిదూ ♦ రంబులయ్యె
దివ్వెటీకడ నున్న ♦ దీపమ్ములట్లుగా, గ్రహములు మందభా ♦ స్కంబులయ్యె
గీ. వల్లభుఁడు వచ్చెననుచు ను ♦ త్ఫుల్లలగుచుఁ, బద్మినులు సంతసంబునఁ ♦ బరఁగిరంత
గగనమున వింతకాంతులు ♦ గంతులిడఁగ, భానుబింబంబు పూర్వాద్రి ♦ పైనఁదోఁచె.

మ. ఇనుఁ డభ్రం బను సింహపీఠమున న ♦ ల్లెక్కంగ నాసంబరం
బున, బందీగృహబద్ధులన్ విడిచిపో ♦ బుచ్చంగ శాసించెనో
యనఁగా వెల్వడె నంతఁ బద్మ మను కా ♦ రాగారమందుండి పె
ల్చన సాయంజలజాంతరాళపతితాం ♦ చచ్చంచరీకౌఘముల్. 105

మ. తమిఁ గర్ణంబులు తూట్లు చెంద నపశ ♦ బ్దంబుల్ ప్రయోగించుచున్
దమపక్షంబుల కడ్డులేదని దివాం ♦ ధంబుల్ ప్రభాతంబురా
నిమిడెన్, శైలగుహాంతరాంతరములం ♦ దీఘూకవుల్, కాకవుల్
ఘుమఘోరంజన మొప్ప నిల్వఁగలరే ♦ మార్తాండతిం జూచినన్ ? 106

ఉ. అంత సమీరనాయకు ల ♦ పార్వతి చూడకమున్నె లేచి తా
రంతరమందుఁ బుష్పవతు ♦ లంచనియున్ గయికోక, పద్మినీ
కాంతలఁ గూడి కాల్వల స ♦ గంబులపైఁబడి వచ్చి, రెవ్వరేఁ
గాంతురటం చదృశ్యులయి; ♦ కాముకకోటికి నేడ ధర్మముల్ ? 107

వ. అంత నాశిష్యతృతీయుం, డన్నదీజలంబులఁ గృతావగాహుండై, యహ
ర్ముఖోచితకృత్యంబుల నెఱవేర్చి, సూర్యభగవానున కర్ఘ్యంబు సమర్పించి భక్తివినమిత
గాత్రుండై సూర్యాభిముఖుం డగుచు 108

సీ. మిత్రాయ పాపల ♦ విత్రాయ లసదబ్జ, పత్రాయ దేవ తు ♦ భ్యం నమోస్తు
సూరాయ నిగమైక ♦ సారాయ భృతలోక, వారాయ దేవ తు ♦ భ్యం నమోస్తు
అర్కాయ మంగళో ♦ దర్కాయ సాధుసం, పర్కాయ దేవ తు ♦ భ్యం నమోస్తు
అరుణాయ పటుతీక్ష్ణ ♦ కిరణాయ పుష్కరా, భరణాయ దేవ తు ♦ భ్యం నమోస్తు
గీ. శ్రీకరకరప్రచారాయ ♦ లోకబాంధ, వాయ తుభ్యంనమోస్తు సూ ♦ ర్యాయ యంచు
ధ్యానమీలితలోచన ♦ ద్వయముతోడ, నంజలిఘటించె నాకుశి ♦ కాత్మజుండు. 109

వ. అంత రామలక్ష్మణులును సూర్యాదినమస్కారంబు లొనర్చి యధ్వశేషంబు
గమింపఁదలఁచి, యీశ్వరు ననుగమించు వినాయకకార్తికేయులభంగి విశ్వామిత్రు
వెంట నరుగుచు 110

సీ. తమకు భక్తి ఫలోప ♦ దల నిచ్చు భూరుహా, నీకముల్ సామంత ♦ నృపులుగాఁగఁ
బార్శ్వద్రుమంబుల ♦ పైఁ బాడు శుకపిక, గణములు వందిమా ♦ గధులుగాఁగఁ
బవనచలల్లతా ♦ భ్రమణంబు లెదుట వే, శ్యాజనమధురలా ♦ స్యములుగాఁగఁ
బ్రితరచ్ఛాయాత ♦ వాతపోతంబులు, శ్రమదీర్చు నంగర ♦ క్షకులుగాఁగ
గీ. దుర్గమారణ్యసీమయం ♦ దునను వారు, జడిగొనక యిట్లు రాజోప ♦ చారములను
ననుభవించుచుఁ గౌశికుం ♦ డచటిచిత్ర, విషయములఁజూపుచును బోవు ♦ వేళ యందు.

గీ. రాక రాకిటు వచ్చె శ్రీ ♦ రాముఁడనుచు, గౌరవార్థంబు వలనక్ష్మి ♦ గానసభను
బెట్టెనో యన మారుత ♦ ఘట్టనమునఁ, గీచకంబుల మృదువేణు ♦ గీత మొప్పె. 112

వ. ఆసమయంబున___ 113

ఉ. అక్కడి చిత్రముల్ దెలుపు ♦ నప్డు మునీంద్రుఁడు రామచంద్ర! యీ
ప్రక్కనఁ జూడుమా యనుఁడు ♦ బాగుగ రామపదంబు వీనులన్
జిక్కమి నీతఁడే విధుఁడు ♦ చిక్కులు దీఱె నటంచు ముంగలన్
నైక్కొను కూర్మి నిల్చెఁ బ్రియు ♦ నేస్తముఁ గోరి, చకోరి పోవుచున్. 114

గీ. పుష్పనారాచుఁ డితఁడు కాఁ♦బోలు నితని, శరములకు గుఱియైనచోఁ♦దరుణిఁ గూడఁ
జనుననుచు వింటఁ దోలినఁ♦జనక రాము, నుత్తలము మాన్పె సతి వీడి♦యొక్కలేడి.

గీ. అనఘుఁ డగుపతి లేని ♦ వనటఁ గుసుమ, బాణబాణౌఘదళితాంగి ♦ పగిది నెదుటఁ
బూవులందాల్చి యొక్క క్రొం♦దీవె గరిత, యధిపుఁ డెందంబుఁ బోవుచో♦నపహరించె

వ. ఇట్లు వనసౌభాగ్యంబుల నరయుచు దారిం బోవుచు నెట్టయెదుర— 117

సీ. నిత్యోత్సవములచే ♦ నిగతమ్ముగ వనలక్ష్మి, నివసించుకోటగా ♦ నెగడుదాని
ఫలవృక్షముల బుభు ♦ క్షులగు పాంథులకెల్ల, నన్నసత్రముమాడ్కి ♦ నలరుదానిఁ
గమలబాంధవుకరా ♦ ఘాత మెట్టిదొ స్వప్న, మందైన నెఱుఁగని ♦ యట్టిదాని
ఫలభక్షులై పరా ♦ త్పరుఁ గొల్చు మౌనుల, కశ్రాంత మాటప ♦ త్రైనదానిఁ

గీ. దడవు లేక శకుంతసం ♦ తానములకు, మానితంబుగ నిల్వ నీ ♦ డైనదాని
వివిధవృక్షలతాదుల♦వెలయుదాని, నరుగుచోఁ గాంచె నొకయర♦ణ్యాని నృపుఁడు.

క. కాంచి తదీయమనోజ్ఞత, రాంచితపరమేష్ఠిసృష్టి ♦ కాత్మ ముదంబుం
గాంచుచు, మార్గాయాసం, బించుకయుఁ దలంపకుండ ♦ నేఁగుచుఁ దనలోన్.

క. శేషంబుగాక, దీని వి,శేషంబుల నెల్లఁ బొగడ ♦ శేషునకైనన్
భాషాపతికైనను, ఫణి, భూషణునకునైనఁ దరమె ♦ భూతలమందున్. 120

వ. అని యిట్లు కొనియాడుచు నచ్చటి విశేషంబుల కాత్మ నలరుచు నందలి సహజవిరోధిసత్త్వంబులకుఁ గలకూటమికిఁ బొంగుచు లక్ష్మణునకు మెల్లన నిట్లనియె.

సీ. అరసితే యయ్యదే ♦ హర్యక్షపోతంబు, శరభంబుపై నెక్కి ♦ స్వారిఁ జేయుఁ
గంటివే ద్వీపము సిం ♦ గంబునోటికి మేఁతఁ, జేసేతఁ గబళంబు ♦ చేసి యిచ్చుఁ
గాంచితే యాపన్న ♦ గము మయూరము పురి, నీడలోఁ జల్లగా ♦ నిద్రఁ జెందుఁ
జూడుమా యాపిల్ల♦లేడి వ్యాఘ్రింబు మీఁ, పా లందుకొనుచు ను♦య్యాల లూఁగు

గీ. అరసితివె యిట్టిచిత్ర మెం♦దైన, నెట్టి సమయమున నైన, ధరఁ బర♦స్పరవిరోధి
జంతుసంతాన మీలీల♦సఖ్యపడుట, గనఁ గొనఁగఁ దోఁచు నిది తపో♦వన మటంచు.

వ. ఇవ్విధిగా వారు మనంబునఁ దత్తల్లక్షణంబులచే నయ్యది మున్యాశ్రమంబ గావలయునని యూహ సేయుచు నయ్యది యెఱింగి కౌశికుం డిదియే మదీయాశ్రమంబని చెప్పుచుండఁగనే, యందలి మునులు విశ్వామిత్రుని రాక యెఱింగి, వారి కెదురై తోడ్కొని పోయి రంత. 123

భుజంగ ప్రయాతము

నమత్సర్వసామంత ♦ నాథో త్తమాంగో
త్తమోద్యత్కిరీటోరు ♦ ధామాభిరామా !
సమస్తాత్మభక్త ప్ర ♦ సన్నాంతరంగా
తిమాత్రాత్మవాసా ! సు ♦ ధీధ్యేయభాసా ! 124

కవిరాజ విరాజితము

లలితసమస్తక ♦ శాలలనాసమ ♦ లంకృతగాత్ర ! యనూనగుణో
జ్జ్వల! వరదా ! జల ♦ జాతహితాన్వయ ♦ సాగరపూర్ణనిశాకర ! ని
ర్మలకవిరాజవి ♦ రాజితభూరిప ♦ రాక్రమచారుభుజాయుగళా !
అలఘుతరప్రతి ♦ భాంచిత ! యుద్ధవి ♦ హార ! విచిత్రమహామహిమా ! 125

ఇది......................................శ్రీపూర్ణప్రజ్ఞ కవి
విరచితం బగు శ్రీరామకళ్యాణంబునఁ దృతీయాశ్వాసము.

—:o:—



శ్రీహయగ్రీవాయ నమః

# శ్రీ రామ కల్యాణము

## చతుర్థాశ్వాసము



కర! శ్రీకరగుణర
త్నాకర! రత్నాకరావృ ♦ తావనిభరణా
స్తోక భుజ! భుజబలద్వే
ధాకృతశీతాంశుఖండ ♦ ధరకోదండా! 1

దేవా! అవధరింపుము. అట్లు విశ్వామిత్రుండు రామలక్ష్మణులతో సిద్ధాశ్రమంబుఁ బ్రవేశించుడు, నందలిమునులు గౌరవపూర్వకముగాఁ గౌశికు నెదుర్కొని సాష్టాంగదండప్రణామంబు లాచరించుచుం దోడ్కొనిపోయిన నం దతండు దీక్షితుండై యుండె ననంతరము వేకువజామున నే కాల్యకృత్యంబుల నెరవేర్చి తమ్మునితోఁగూడ రాముఁ డయ్యెడ కేతెంచి. 2

శా. ప్రాతఃకాలమునందె మేలుకొని ని ♦ ర్వర్తించి స్నానాదులన్
జేతఃప్రీతిఁ గుశాసనంబున సుఖా ♦ సీనుండునై భక్తి ని
ర్వ్యాతప్రోజ్జ్వలదీపమ ట్లలరువి ♦ శ్వామిత్రుఁ, గోప్రాగ్ని ని
ర్ధూతామిత్రుఁ, బవిత్రు నందుఁ గని తో ♦ డ్తో మ్రొక్కి ఱేఁ డిట్లనున్. 3

శా. తేజోభాస్కర! యెప్డు వత్తు రసురల్ ♦ దీక్షన్ వనం బెన్ని నా
ళ్ళోజం గావఁగఁజెల్లు నా, నట ముని ♦ వ్యూహం బనున్, వాని దీ
క్షాజోషం జెపు జేగుదెంతురో యెఱుం ♦ గంజాల మారక్కసుల్
రాజా! యీదినమాది మీకు వదవ ♦ రాత్రంబు గావందగున్. 4

క. అనిచెప్ప, బాణబాణా, సనములు ధరియించి రామ ♦ సౌమిత్రులు వే
మునులా మదమంద నొడలె, ల్లను గనులుగ మెలఁకువం జె ♦ లంగిరి మిగులన్. 5

ఉ. ఆనరనాథు లట్లు హృద ♦ యంబునఁ జీమ చిటుక్కుమన్న నా
మానవభక్షులే యనుచు ♦ మార్కొన నా ననుసంతసంబుతో
దానవదానవద్విపవి ♦ దారణదారుణవృత్తులై నపం
చాననపుంగిశోరముల ♦ చాడ్పునఁ గన్పడఁ జొచ్చి రత్తతిన్. 6

మ. ఎటు వీక్షించిన రామలక్ష్మణులు తా ♦ మే యై, యరణ్యంబు నం
తట, బాణాసనధారులై భుజబలో ♦ ద్యచ్ఛక్తిఁ బాలింప న
చ్చట మౌనీశ్వరులెల్ల వీతభయులై ♦ స్వాహాతినాదంబు లు
త్కటమై యొప్పఁగ వేల్చి రాహుతు లమ ♦ ర్త్యశ్రేణి యుప్పొంగఁగన్. 7

క. ఆలీల నానృపాలక, బాలకు లటు లెప్పఁ గంటి ♦ పై వ్రాల్చక శ్ర
ద్ధాళులయి కాచు చటవీ, శ్రీలాలిత్యంబుఁ జూచు ♦ చిత్తముతోడన్. 8

వ. ఒక్కనాఁడు 9

ఉ. ఐదుదినంబు లిప్పటికి ♦ నాయె నిశాచరుఁ డొక్కఁడేనియుం
బాదము పెట్టఁ డిందు నిఁకఁ ♦ బైననుమాత్రము వచ్చునొక్కొ, యిం
కీదివసం బొకండెకద ♦ యేమగు నింతట నంచుఁ దద్వన
శ్రీ దరిసింప లక్ష్మణుని ♦ జీరి రఘూద్వహుఁ డంత నిట్లనున్. 10

ఉ. చేతమునందుఁ గామమును ♦ జేరఁగనీక విరక్తిఁగొల్చునీ
యాతత మహాతపోవనము ♦ నందె విరుద్ధము సర్వదా యత
స్వాతపవారకంబు లయి ♦ హాయిడుకొమ్మలతోడఁ గాముక
వ్రాతముమాడ్కి నొప్పుతరు ♦ వర్గముఁ గాంచితివోయి లక్ష్మణా! 11

గీ. ద్విజసమూహంబు దగ్గఱఁ దీసి తన్నుఁ, బొగడుచున్ వచ్చుసత్కవి ♦ పుంగవులకుఁ
బ్రత్యహంబును గోరిన ♦ ఫలము లిచ్చు, రాజువలె నున్నయీతరు ♦ రాజుఁగంటె.

శా. అంతేవాసులు వేదచింతనము చే ♦ యంబోలు నిచ్చోటు, నీ
ప్రాంతంబందున దీక్షతోఁ దమద్విజ ♦ త్వం బద్ది యన్వర్థతా
వంతంబుం బొనరింపనో యన శుక ♦ వ్రాతంబు లవ్వేదముల్
సంతోషంబునఁ జెప్పుచున్న వవిగో ♦ సౌమిత్రి! యాలించితే. 13

చ. కెలఁకుల నున్నచెట్లఁ బరి ♦ కించుచుఁ దొండము లెత్తి వానిశా
ఖలఁ దెగటార్చు సేనుఁగులఁ ♦ గాంచితె! నాచెయిచాయఁ జూడుమా
కొలఁకుల నిర్మలోదకముఁ ♦ గ్రోలుచు లేఁగసవుల్ మెసంగి వి
చ్చలవిడి సంచరించుమృగ ♦ సంతతిఁ గాంచెదు శాద్వలంబులన్. 14

గీ. చూడు మటు భూరుహాధఃప్ర ♦ సుప్తనకుల, నాసికావివరోత్థని ♦ శ్వాసమారు
తమ్ములన్ గ్రోలుచున్ గౌతు♦కమ్ముతోడఁ, గ్రాలుకాకోదరంబులఁ♦గానిపించు.

మ. అతిగాఢంబుగఁ గూర్కుచున్న దదిగో ♦ హర్యక్షు వీక్షించితే
మతిఁ దత్కేసరమున్ మృణాళమని సం ♦ భావించి మత్తేభ ము
ద్ధతిలాఁగున్ దిలకించితే; హరిణపో ♦ తం బద్దె సమ్యక్క్షుధా
ర్దితమై తత్స్నుతపీతముక్త మగువ్యా ♦ ఘ్రీదుగ్ధముం గ్రోలెడున్. 16

గీ. తమపదువుతోడఁ బోవుచు ♦ దారిఁ గృష్ణ, సారములు మేనికండూతి ♦ దీరునట్లు
రాయుచున్నను గదల కు♦గ్రముగఁదపముఁ, జేయునీమునిసుతుల నీ♦క్షించినావె?

గీ. ఉరగదంశాదిబాధల ♦ నొందకుండ, నాతపోనిధిపర్యంక ♦ మధివసించి
మేఁతఁ గొనిరాఁగ నేఁగిన ♦ మాతకొఱకు, నెదురుచూచెడునాపిల్ల ♦ యిట్టిఁగంటె?

సీ. త్రిషవణస్నానంబు ♦ తీర్థవిధానంబు, తరువల్కలాజిన ♦ ధారణంబు
ప్రాతరాహ్నికమును ♦ బరమేశుధ్యానంబు, నతిథిజనాభ్యాగ ♦ తార్చనంబు
నిశ్చలభావంబు ♦ నిత్యాగ్నిహోత్రంబు, సదసత్పదార్థ వి ♦ చారణంబు
నిగమైకపఠనంబు ♦ నిమ్నగాసలిలంబు, కందమూలాహార ♦ ఖాదనంబు

గీ. ఘనతరనికుంజసీమలఁ ♦ గాఁపురంబు, వదనకమలంబునను బ్రహ్మ ♦ వర్చసంబు
గలిగి చెలువారుమునివృత్తి ♦ కన్ననుభయ, లోకసుఖభాజనం బిల ♦ లోనఁగలదె?

చ. తలఁపఁగ లోకమందు జడ ♦ ధారుల దౌవిభవంబు వారిని
శ్చలహృదయంబు వారిదగు ♦ శాశ్వతసౌఖ్యము వారికీర్తిలో
పలను శతాంశమేనియుఁ బ్ర ♦ పంచమునెల్ల నతంబునన్ భుజా
తలమునఁ బూని యేలువసు ♦ ధాపతికేనియుఁ సంభవించునే? 20

ఆ. భూమిపాలుఁడౌను ♦ బురుహూతుఁడౌఁ దపో, నిధులయగ్రమందు ♦ నిలువలేరు
దానఁగాదె గాధి ♦ తనయుండు రాజ్యంబు, మాని తపముఁ జేసి ♦ మౌనియగుట.

వ. అని యిట్లయ్యాశ్రమంబు నభివర్ణించుచుఁ దమ్మునకుఁ దత్తద్విశేషంబు లెఱింగించుచు నానందించుచుండ 22

సుగంధి. ఏటు కొక్కుమానిగాఁగ ♦ నేసి చంపుఁడీ తలన్
తాటికాయలట్లు భూత ♦ ధాత్రిపైన రాల్పుఁడీ
కూటకంబుఁ బట్టి నేలఁ ♦ గూల్పుఁడీ యటం చొగిన్
దాటకాసుతుల్ సరాతు ♦ ధాను లౌచు రానటన్, 23

క. ఈమాడ్కి వారు తమయా, రామాలోకమున కంత ♦ రాయ మటుండం
గా మునులఁ దిట్టుకతమున, రాముఁడు తత్క్షణమె కినుక ♦ రా నుగ్రుండై. 24

చ. నిలునిలుఁ డోరి నేఁడె ధర ♦ నీతలికిన్ బలియిత్తు మిమ్ముఁ గ్రూ
రులరయి యేమిపాపము నె ♦ ఱుంగక శ్రీవారిఁ గొల్చునట్టివా
రల కహితంబుసేయుదురె ♦ రాముఁడు రాక్షసకాళరాత్రియై
యిల మిముఁ జంపుపాంటె జని ♦ యించె నటంచు నెఱుంగరైతిరే. 25

క. కలనికి నాయితమై కడ, మెలఁకువమై నిలువుఁ డిపుడె ♦ మీవౌప్రాణా
నిలముల నస్మచ్ఛితశర, బిలేశయము లిప్పుడిపుడె ♦ పీలుచుఁగాతన్. 26

చ. అని పలుకన్ సుబాహుఁ డను ♦ నారజనీచరుఁ డుగ్రుఁడై రుషా
జనితమహోరణాత్ముఁడయి ♦ జన్మ తరించె నితండు రాముఁడా!
కనుఁగొనఁబోవునట్టిలత ♦ కాళులఁ దాఁకినయట్టులయ్యె, మా
జననిఋణంబుఁదీర్చుకొనఁ ♦ జాలితిఁగా యని రాము నిట్లనున్. 28

ఉ. కల్లరివై జనించినది ♦ గా మము నెన్నఁడుఁ బాయనట్టి మా
తల్లిని జంపి శాశ్వతపుఁ ♦ దద్విరహంబు నొసంగి తీవు నీ
తల్లికి దానికింబ్రతిగఁ ♦ ద్వద్విరహంబు నొసంగి కూర్మిసం
ధిల్లగఁ దాటకాఋణము ♦ దీర్చెద నిల్లలుకంగఁ బండుగే! 28

క. అనిపలుకు, సుబాహుం గని, జనయిత్రిని బాసి నిలువఁ ♦ జాలవుకాఁబో
లును బాపం బీయస్త్రము, నినుఁ దల్లిసమీపమందు ♦ నిలుపుంగాతన్. 29

క. అని యాగ్నేయాస్త్రంబుం, గొని యభిమంత్రించి శరముఁ ♦ గోదండమునం
దున నుంచి వేయ భస్మం, బునుగాఁగావించె నిముస ♦ మునన, సుబాహున్. 30

గీ. ఆపిదపఁ దిరిగియెపుడా ♦ రూపుతోడఁ, గానరాకుండ మారీచు ♦ గాటమైన
మారుతాస్త్రమ్ముతో నేయ ♦ మనుజవిభుఁడు, పోయిపోయియతండునం ♦ భోధిఁబడియె.

క. అంతన్ దక్కినసురలా, పొంతన్ గనరాక పాఱి ♦ పోయిరి, మునులున్
సంతోషించిరి, యాబలవంతునిపై నపుడు పుష్ప ♦ వర్షముఁ గురిసెన్. 32

వ. అంత విశ్వామిత్రుండును, దనదీక్షావసానంబున రాఘుచంద్రు నభినం
దించుతలంపున నయ్యెడ కేతెంచి, తనకు సాష్టాంగప్రణతుం డగురాము నీక్షించి 33

ఆ. దుష్టులైనవీరిఁ ♦ దుత్రిటిలోపలన్ యమ, లోకమునకుఁ బంపి ♦ మాకకాదు
భువలయమునకెల్లఁ ♦ గూర్చితి కుతుకమ్ము, చంద్రుఁడట్ల రాఘు ♦ చంద్ర! నీవు. 34

శా. జన్మం బిప్పటి కెట్టివిఘ్నులవలే ♦ శంబైన లేకుండ ని
ష్పన్నంబయ్యెఁ దరించినాఁడను భవ ♦ త్సాహాయ్యముం జేసి, సా
క్షాన్నారాయణమూర్తి వీవుగద! నీ ♦ సత్త్వాదికంబుల్ నుతిం
ప, న్నే నెంతటివాఁడనయ్య రఘురా ♦ మా! భక్తకల్పద్రుమా! 35

క. అని రాముం బొగడుచు నా, దినశేషముఁ గడపి సంధ్యఁ ♦ దీరిచి నృపనం
దనులను బరుండుఁడని యు, మ్మునివరుఁడు తలంచెఁ ♦ జిత్తమున నిక్కరణిన్. 36

చ. క్రతువు సమాప్తమాయె, జన ♦ కంటక తాటక కూలెఁ, దాటకా
సుతుఁడు సుబాహుఁడున్ మడసె ♦ శూరులు రక్కసు లెల్లరుం బలా
యితులయి రెల్లెడన్ విజయ ♦ మే సమకూరెను లేదు శాంతి నా
మతి కిసుమంతయున్ బలువు ♦ మస్తముపైఁ గలయట్టు లుండెడున్. 37

గీ. ప్రౌఢి రాముండు శైవచా ♦ పంబుఁద్రుంచి, ధరణిసుతయైన సీత న♦ద్వాహమాడు
నాఁడుగా రామకల్యాణ♦నాటకంబు, నడుపసూత్రధారుఁడనగు ♦ నాకు శాంతి.

చ. తనపనికోసమై యొరుల ♦ దగ్గఱకుం జని చేయిచాఁచి య
య్యనఘులపుత్త్రులన్ గొనిన ♦ యప్పుడు చయ్యన వెంటవెంటనే
తనపని పూర్తిచేసికొని ♦ తత్తనుజన్ముల నప్పగించుద
న్కను నెటువంటివానికయి ♦ నన్ మతి కంటికి నిద్రవచ్చునే! 39

క. అని యిటు దీర్ఘాలోచన, మున మునిఁగియు, రాత్రిశేష ♦ మును గడపి యుష
స్సున నవె, కృతాహ్నికుఁడౌ మునిఁ, గని రాముఁడు లక్ష్మణుండు ♦ గడవనిభక్తిన్.

గీ. నిరుపమతపఃప్రదీపకా! ♦ నేఁటిదినము, సెలవొసంగుము మా కను ♦ ష్ఠేయమేదొ
అనుడుమునియనుసంపూర్తి ♦ యయ్యెఁగాదె, క్రతువు, కార్యంబు వేఱేమి ♦ కలదు మనకు?

చ. జనకుఁడు పిల్వఁ బంచెఁ దన ♦ జన్నముఁ జూడఁగ, మాకు నచ్చోటుం
జనవలె, మీరు నిన్నిదివ ♦ సంబులఁ గ్లేశముఁ జెందినార, లం
దునఁ గననౌ విచిత్రములు ♦ తోకొనిపోయెద లెం డపూర్వమౌ
ధనువు నయోనిజాతయగు ♦ తన్వియుఁ గానఁగవచ్చు నయ్యెడన్. 42

క. సురసరసిజాస్యయో! కి, న్నరకాంతయొ! సిద్ధపద్మ ♦ నయనయొ! విద్యా
ధరకామినియో! యన నా, తరుణీరత్నంబు పొలుచు ♦ ధరణీపాలా! 43

గీ. మంజులపటలయి హృదయంగ♦మమ్ములైన, యమ్మధురవాణివాలునే ♦త్రమ్ములకును
బాలకెంతయుమహిఁగని♦ష్ఠమ్ములౌటఁ, దమ్ములను పేరఁబొలుచుఁబ♦ద్మమ్ములధిప!

గీ. కేశశైవాలినీసమా ♦ కీర్ణ యగుచు, మంజుపదపద్మశోభాస ♦ మాన యగుచు
విశ్రుతాఖిలభువనయై ♦ వేయునేల, పరఁగు నక్కాంత లావణ్య ♦ సరసివోలె. 45

గీ. ఎవ్వఁడేఁగాని శివచాప ♦ మెక్కువెట్టె, నేని నాకన్య జానకి ♦ నిచ్చు యట్టి
విక్రమోదారు నృపు గార ♦ వింతుననుచుఁ, బార్థివుం డగుజనకుండు ♦ ప్రతినఁజేసె.

చ. అది విని దేశదేశముల ♦ యందు వసించెడు రాకుమార లా
సుదతిగొనంబులుం జెవుల ♦ సోఁకినఁ బట్టఁగరానికూర్మితో
మది నిలుపంగలే కటుకు ♦ మన్ననమైఁ జనుదెంచి చాపముం
గదులుప లేక పోయిరి మొ ♦ గంబులు వాడఁగ వచ్చుదారినే. 47

క. మనుజేశ్వర ! యాబాణా, సనమును వర్ణింప మాకు ♦ శక్యంబగునే
కనుఁగొందు గాక నీవే, తినఁ బోవుచుఁ గూర రుచులు ♦ తెలియఁగ నేలా ? 48

క. ఇటు ముని పలుకఁగ, రాముఁడు, కుటిలాలకఁజూచు వేడ్క, ♦ కోదండంబున్
బటు గతి వంచెడు కోరిక, ఘటియిల్లఁగఁ బల్కె నంతఁ ♦ గౌశికుతోడన్. 49

గీ. చనఁగలయఁబిల్వకుండిన ♦ జన్నముల కు,టంచుఁజాటును శ్రుతి, పెద్ద ♦ లైన మీరె
పిలువ,నింకేమి యోజింప ♦ వలెఁ దథాస్తు, బద్ధులము భవదాజ్ఞకు ♦ భానుతేజ! 50

వ. అని యట్లు వారును బలికిన, నంత నమ్మునీశ్వరుండు తక్కటి మునీశ్వరులతో రామలక్ష్మణులు వెంటరా మిథిలఁ జేర నరుగుచుఁ గతిపయప్రయాణంబుల 51

క. మిను దాఁకువృక్షపంక్తులఁ, గనుపండు వొనర్చునట్టి ♦ కాంతారమునన్
గనుఁగొనిరి వార లొక్కెడ, ననుపమసుఖధామ గౌత ♦ మాశ్రమసీమన్. 52

చ. అచటి నికుంజపుంజములు ♦ నచ్చటి భానుకరచ్ఛవిచ్ఛటా
విచికిలచారుతామరస ♦ విశ్రుతసుశ్రుతగీతపుష్పలి
ణ్ణిచయనవీనగానకమ ♦ నీయతరోరుసరోవరంబులున్
రుచిరములై మలిమ్లుచుల ♦ రూఢి మనంబు హరింప నేఁగుచున్. 53

క. పాషాణమునుండియ యొక, యోషారత్నంబు వొడమ ♦ నుప్పొంగుచు రా
ఘూభమణుఁ డను మునివరుతో, భాషింపు మి దెవ్వ, రేల ♦ ప్రభవించె నిటుల్ ?

గీ. అనుడు, ముని యను నిదిగౌత ♦ మాశ్రమంబ, యా మెతద్భార్య, శాపోప ♦ హతిఁజిక్కి
రాయియై నీదుపదధూళి ♦ రామ యయ్యె, నిన్నుఁ బూజింపని టెవచ్చు ♦ చున్న దదిగో!

వ. అని కౌశికుండు చెప్పుచుండఁగనే యాయంగనామణి, భర్తృవచనప్రకారంబుగా నమ్మహాత్ము, దుష్టనిగ్రహార్థంబు రఘుకులంబున జన్మించిన నారాయణమూర్తిగా నెఱింగి కృతప్రణామయై, భక్తిపూర్వకంబుగా నిట్లు స్తుతించె. 56

మ. బహుళాంహోజటిలాంధకారపటలీ ♦ భానూదయోజ్జృంభితం
బహుతారణ్యదవానలాభ పశుభా ♦ హార్యాశనీభూత, మా
ద్రిహిణేశానసురేంద్రముఖ్యవిబుధ ♦ స్తోమైకసంభావ్య మీ
మహి నీపాదరజోలవంబు రఘురా ♦ మా! భక్తకల్పద్రుమా! 57

శా. రాతిన్ నాతి యొనర్చు టేమి ఘన మా ♦ రా! నీ కహో! వర్ణనా
తీతంబౌ భవదీయ శక్తి, శిలలన్ ♦ దేలింతు సంద్రంబులోఁ,
గోఁతిన్ బంకజనూతిఁ జేసెదవు, నీ ♦ కున్ దుల్యు లున్నారె? లో
కాతిప్రాభవమూర్తి వీవు, రఘురా ♦ మా! భక్తకల్పద్రుమా! 58

శా. వన్యాహారములన్ భుజించుచుఁ దపో ♦ వ్యగ్రాత్ములై నిన్నె సౌ
జన్యంబొప్పఁగఁ గొల్చుమౌనితతికే ♦ సుందర్శనం బీవు, నా
ధన్యత్వం బది యేమియందును నినున్ ♦ దర్శింపఁ గంటిన్ జగ
న్మాన్యంబయ్యెను నాచరిత్ర రఘురా ♦ మా! భక్తకల్పద్రుమా! 59

గీ. పతిని ననుఁగూర్చిన మహోప ♦ కృతికి నీకు, నే నొనర్చెడియుపకార ♦ మేమిగలదు?
నేను భర్తృసమన్విత ♦ నైనపగిది, నీవు శీఘ్రంబె, యంగనా ♦ న్వితుఁడ వగుమ.

క. అని యీగతి యమ్మానిని, తనశాపంబునకు ముక్తి ♦ దయచేసినయా
యినవంశ్యుని శ్లాఘించుచుఁ, జనియెను గౌతమునికడకుఁ; ♦ జని రవ్వారున్. 61

వ. ఇటు చనిచని ముందర రమణీయతరం బగు రాజమార్గంబులును, నభ్రంకషం
బులగుప్రాకారంబులును గలిగి యలరారు నొక్కనగరంబుం గని కౌసల్యానందనుం
డానందంబుఁ జెంది యది యెవ్వరిపురం బని మునివరు నడుగ నతండు—— 62

గీ. అదియె సద్గుణపుంజమై ♦ యలరు జనకు, చేతఁ బాలిత మగు గుణా ♦ శిథిల మిథిల
కనుము! స్వాహాతి నిగమని ♦ స్వనముతోడ, జన్నపుంగ్రొంబొగల్ లేచి ♦ మిన్నుముట్టు.

ఉ. 'ఊఁ' యనకుండఁ బండితు లహో ♦ హో యన వేదము వాయిగుద్దిన
ట్లైయెడఁ జెప్పుమన్న వచి ♦ యింతురు, శాస్త్రములన్ననో! తృణ
ప్రాయము, గౌతముండె ప్రతి ♦ వాదిగ వచ్చిన నోర్మెదల్పఁగా
నీయరు, సాటి యెవ్వ రిఁక ♦ నీపురిఁగల్గు మహాసుశాలికిన్? 64

గీ. మేదినికి సాధులౌటచేఁ ♦ గాదు రాజు, హంస లగు టెందలినృపావ ♦ తంసు లెల్ల
అతితర మగుదివ్యశ ♦ శౌసమృద్ధి, నఖిలలోకాప్తతనురాజ ♦ హంసు లైరి. 65

సీ. మతితిరస్కృతబృహ ♦ స్పతులన్న నవ్వారి, బుద్ధివైభవములఁ ♦ బొగడ నేల?
తనువు దాల్చినపువ్వు ♦ ధన్వులన్నను వారి, యందంబు చందంబు ♦ నడుగ నేల?

అధరీకృతత్రిపు ♦ రారులన్నను వారి, కోదండగరిమ వా ♦ కొత్రువ్వ నేల ?
అర్థికిఁ బ్రాణంబు ♦ లర్పింతురన వారి, దాతృతామహిమంబుఁ ♦ దలఁప నేల ?
గీ. అతి యనఁగఁ జక్రమనితప్ప ♦ నన్యమేదొ, యెఱుఁగరన వారిసౌభ్రాత్ర ♦ మెన్న నేల!
యినకులవతంస! పలుమాట ♦ లేల సుగుణ, రత్నరత్నాకరము లిందు ♦ రాచవారు.

క. సముదితహృదయాంబుజులై, క్రమలాభముచేతఁ దృప్తిఁ ♦ గాంతురు గానీ
తమయొత్తుధనముఁ బోషిన, నమలిను లిట వైశ్య లన్యత ♦ మాడరు భూపా! 67

గీ. పాదజులు ధనధాన్యసం ♦ పన్నులగుచు, సేద్యమును నిజవృత్తిగాఁ ♦ జేయుచుండఁ
గాఁపురముఁజేయుదురుజనుల్ ♦ కలవనంగ, నెట్టిదియుఁగూడఁ దెలియ కీ ♦ పట్టణమున.

గీ. శిష్యుఁడు సమస్తశాస్త్రప్ర ♦ సిద్ధుఁడగుట, దేశికునిఁబొందితీన్యార్తిఁ ♦ దెలుపునట్లు
ప్రజలు నిజకులాచారత ♦ త్పరతనుంట, మానవేంద్రునిపాలనా ♦ మహిమఁజూటు.

వ. అని యిట్లుప్పూరివిశేషంబులను, నందలివారిసద్గుణములను, క్షోణిపాలనా
చాతుర్యంబును, మునివరుండు పేర్కొనిన, సానుజుండై వినుచుఁ గోట ప్రవేశించు
తతి నందొక్క సౌధోపరితలంబున- 70

చ. స్మరుఁడనుబోయవాఁడు తన ♦ స్వాంతమృగంబును బట్టి నిడ్డవా
గురలన నొప్పుముంగురులఁ ♦ గొత్రు త్తసిరిం దులకించుదాని, న
చ్చరలనుబోలు నెచ్చెలుల ♦ చాటున నుండెడుదాని, నిండుచం
దురునెనమోముదాని, నొక ♦ తోయజనేత్రను గాంచెఁ గూరిమిన్. 71

గీ. కాంచినదియాది దానియా ♦ కారగరిమ, నయనయుగళికి వాసెచ ♦ నకముగాఁగ
రాగముబయలొక్కసంగనా ♦ రాజసుతుఁడు, అడఁచుకొనియిట్లు చింతించె ♦ నాత్మలోన.

ఉ. ఎవ్వతె! యీపరిఫుల్లజల ♦ జేక్షణ, నాహృదయంబు నక్కటా
పువ్విలుకానితూపులను ♦ బోలుకటాక్షపరంపరావళిన్
నొవ్వఁగఁ జేయుచున్నది, ఘ ♦ నుం డగు కౌశికుఁ డన్నగుర్తు లీ
జవ్వనియందుఁ గానఁబడు ♦ జానకి యీజలజాక్షి గాదుగా! 73

ఆ. ఈలతాంగిపైన ♦ నేలకో! నాకను, రాగ మొదవె నంత ♦ రంగమందు
నాడుపై విరాళి ♦ నాఁతికి నున్నట్లు, గానిపించు నేమి ♦ కారణంబు! 74

మ. అనురాగం బధికంబు గల్గియును నా ♦ యం, దేను వీక్షించుచో
వను వీక్షింపక యట్టునిట్టు గను, షే ♦ నం బుల్క తేపార నేఁ

జనుచున్నం గనకుండ నొక్కమొగి నా ♦ చాయన్ బ్రసారించులో
చవముల్ కాముని తమ్మితూపులొ యనన్ ♦ చంద్రాస్య యుత్కంఠతన్. 75

ఆ. ఇట్టు లాత్మఁదలఁచు ♦ చేకాగ్రవృత్తితో, నెఱఁగఁడయ్యె నృపుఁడు ♦ గురునితోడఁ
బోవుచుండెఁగాని ♦ పోవునదెటకో! య, మ్మధురవాణిమీఁద ♦ మనసు దగిలి. 76

వ. ఇట్లు కౌశికునితోఁ బోవుచుండ నంత జనకుండు ద్వారపాలని వేదిత కౌశికాగమనుండై, యెదురేతెంచి యమ్మునీంద్రునకు మ్రొక్కి యుచితాసనాసీనునిం జేసి యుభయకుశలోపరి— 77

క. ధారుణిపతులందు మహో, దారుఁడ వైతివి ఫలాప్తిఁ ♦ దనరె సవంబున్
మీ రరుదెంచుటచే మద, ♦ గారంబు పవిత్రమయ్యెఁ ♦ గౌతుకి నైతిన్. 78

గీ. అనుచుఁ దత్పార్శ్వభాగంబు ♦ నందు సూర్య, చంద్రులట్లున్న రామల ♦ క్ష్మణులఁ జూచి
యే మహాత్మునిసుతులు వీ ♦ రిరువు రంచు, మౌని నడుగంగ, నతఁడును ♦ మైథిలునకు.

చ. దశరథపుత్త్రు లీసుగుణ ♦ ధాములు, వీరికి నెవ్వరున్ జతు
ర్దశభువనంబులందును బ ♦ రాక్రమమందున సాటిరారు, బా
లిశు లగు దైత్యులన్ దునిమి ♦ లీలగ నాసవనంబుఁ గాచి యీ
పశుపతికార్ముకంబుఁ గను ♦ పండువుగాఁ గనవచ్చి రీగతిన్. 80

గీ. కాన వేగంబె యాహర ♦ కార్ముకంబు, వసుమతీనాథ! తెప్పింప ♦ వలయు ననిన
నట్లకాక యటంచు నా ♦ యవనిజాని, బలులఁ బదివేవురను దేరఁ ♦ బనుప నంత.

వ. వారును నృపునాజ్ఞ శిరసావహించి, యాహరశరాసనంబుఁ దేర నేఁగ నచ్చట, సీతాదేవియు రాము నీక్షించినది మొదలు నంగజబాధాదోదూయమానాంగియై, చెలికత్తెల వీడి, రాముండు గానవచ్చున ట్లొక్కయెడ నొంటరిగఁ గూరుచుండి రామునియందు బద్ధానురాగయై— 82

శా. సాంద్రానందముఁ గూర్చుచున్ జనదిదృ ♦ క్షాపాత్రమై, మేల్గొనాల్
సంద్రింబ ట్లలరారుచున్ దశదిశా ♦ చక్రంబునుం గాంతిని
స్తంద్రింపై దరహాసచంద్రికల జ్యో ♦ త్స్నావంతముం జేయు నీ
చంద్రుం డెవ్వఁడొ! నాదు కన్నుఁగవకున్ ♦ సంతోషముం గూర్చెడిన్. 83

మ. నవలావణ్యవిలాసవారినిధిలో ♦ నన్ శ్రీ దలిర్పన్ సము
ద్భవ మైనట్టి శశాంకుఁడో యనఁగ నే ♦ తద్వక్త్ర మొప్పారుఁ, ద
ద్భవ మౌగ ర్తము నాఁగ నాభి తనరుం, ♦ దద్వీచులో నాఁ దగున్
ద్రివళుల్, నామన మీతఁ డెవ్వఁడొకొ యం ♦ దీభూతముం జేసెడిన్. 84

సీ. ఈయందగానిమై ♦ చాయ నీక్షించునైఁ, గుసుమాయుధుని జూడఁ ♦ గోరు నెవతె?
ఈసుందరాకారు ♦ నించుక చూచునై, నలకూబరుని మాట ♦ దలఁచు నెవతె?
ఈమోహనాంగుని ♦ మోముఁ గన్గొన్నచోఁ, జందురుపై భ్రాంతిఁ ♦ జెందు నెవతె?
ఈతనిలావణ్య ♦ మింత గోచరమైనఁ, బాకశాసనిఁ జూడ ♦ భ్రమయు నెవతె?
గీ. ఇట్టిసౌందర్యనిధియైన ♦ యట్టినాథుఁ, బడయఁజాలనినాఁతిసౌ ♦ భాగ్య మేల?
భాగ్య మేల? తలంపన ♦ ప్పడఁతిజన్మ, నంబు భస్మంబులోనిహ ♦ వ్యంబు కాదె.
గీ. నీలమేఘంబుకైవడిఁ ♦ గ్రాలునితని, చేత లాలితనైన వీని ♦ చెంత నెపుడు
మెఱపుఁగ్రొందీవెయుంబోలె ♦ మెలఁగు మెలఁత, భాగ్యమే భాగ్య, మద్దాని ♦ భవమె భవము.
ఉ. తమ్ముల నేలునీతఁ డను ♦ తత్త్వము నొక్కివచించు వీనిహ
స్తమ్ములె, ధర్మవేత్త యను ♦ సంగతిఁ జెప్పెడు వీనిజ్యాకిణాం
కమ్ములె, యెంతయున్ శ్రితులఁ ♦ గగ్గప్రవేశముఁ జాటు వీనినే
త్రమ్ములె, యెవ్వఁ డీసుగుణ ♦ ధాముఁడు నాదుమనోభిరాముఁడా. 87

వ. ఇట్లంతరంగంబున నారాజకుమారు నీక్షించినది మొదలు తన్నిబద్ధస్వాంత యై యున్న భర్తృదారికకుం దక్కుంగలతక్కులనామధేయజిజ్ఞాస లగునంతఃపురాంగనలకును, నవ్వారు దశరథాత్మజు లౌ రామలక్ష్మణు లనియు, హరచాపారోపణంబునకుం గౌశికానీతులై సభామండపంబున కేతెంచి రనియుఁ జెప్పిన, నాలతాంగు లపరిమితానందభరితలై 88

సీ. ఈతఁడే కా! ఋష్య ♦ శృంగసంభృతచరు, ప్రథమాంశమైనప్ర ♦ భావశాలి
ఈతఁడే కా! శత ♦ మాతంగబలయైన, తాటకన్ దున్మిన ♦ ధన్యమూర్తి,
ఈతఁడే కా! దాన ♦ వాతంకముం బాపి, కౌశికునుతిఁగన్న ♦ ఘనభుజుండు
ఈతఁడే కా! రాతి ♦ నాఁతిఁ జేసినయఘు, టితఘటనాశక్తి ♦ వితతకీర్తి.
గీ. ఇతఁడె కా! తొల్లి దేవతా ♦ హితమొనర్పఁ, బంకజాసనముఖసుర ♦ ప్రార్థితుఁడయి
దశరథావనిజానికిఁ ♦ దనయుఁడౌచు, నవతరించినయట్టినా ♦ రాయణుండు! 89
క. అని యిట్లు దాసదాసీ, జనములచే వినియు నచటి ♦ జలజాతాక్షుల్
వినితించుట గని, జానకి, ఘనమై యనురాగభరము ♦ గడలుకొనంగన్. 90
ఉ. అక్కట వీనియందు హృద ♦ యంబు దగుల్కొనియెన్ మరల్పరా,
దెక్కరణిన్ లభించు నితఁ ♦ డేమి యొనర్చెద, నీశరాసనం
బుక్కున నీతఁ డెక్కిడఁగ ♦ నోపునొ! యోపఁడొ! యోపకున్న, నా
మక్కువఁ దీర్చువా రెవరు ♦ మానసమున్ మరలించు టెట్లొకో! 91

ఉ. ఎందఱు రాజు లీధనువు • నెత్తఁగ వచ్చి పరాభవంబునుం
జెందఁగలే; దిదెంత యని • చెప్పుచు నెందఱు వీనినింగద
ల్పం దమచేతఁగామి వడిఁ • బాఱిరు, బాలకుఁ డీతఁ డేమి చే
యుం దురదృష్టరాల, నృపుఁ • డుంపవగా విలుఁ బెట్టనేటికిన్ ? 92

గీ. తథ్యముగఁ బుష్పచాపుని • తాత యితఁడు, రూపరేఖాదులే దీని • రూఢి సేయు
నేజనకునింటఁగలదొకో • యీమహాత్ము,నాయకుని గాఁగఁ బడయుప • వ్మాత్రయతాక్షి?

ఉ. ఎందుకు మందభాగ్య నగు • నే నెచటన్, వినయాదిసద్గుణా
నందితలోకుఁ డానృపతి • నందనుఁ డెచ్చట? నక్క యేడ, సం
క్రిందనలోక మేడ? వృథ • గాఁ బరగెత్తెద వేల డెందమా !
యందనిమ్రానిపండ్లకయి • యాస వహించుట నీకు న్యాయమా? 94

గీ. అక్కటా! యేటికి నలభ్య • మౌ పదార్థ, మందు గాఢానురాగంబు • నందఁజేసి
యబల యను దయ కాసంత • యైన లేక, చిక్కులం బెట్టె దూరకే • చిత్తజన్మ!

ఉ. పంచశరుండ వంచు నినుఁ • బల్కుదు రందఱు, వేనవేలు వ
క్షించుచు నందు బాణము లి • సీ హతి పంచక సర్థమై దెటుల్ ?
పంచశరాభిధానము భ • వత్పరమై విలసిల్లు నెట్లగుం ?
బంచతఁ గూర్చుబాణములఁ • బట్టుకతంబునఁ గాక మన్మథా ! 96

ఆ. సౌఖ్యకారి యంచుఁ • జల్లనివాఁ డంచు, మందు లంద్రు నిన్ను • మాతరిశ్వ!
అగ్నిఁజిమ్మ నెటులఁగ • రకట "వాయో రగ్ని" యనెడు వేదవాక్య • మనృతమగునె?

చ. అని యిటు లాలతాంగి హృద • యంబునఁ బుట్టియుఁ దన్ను నేచు న
మ్మనసిజుపైన రోసి, పవ • మానునిపైఁ గను లెఱ్ఱఁజేసి, వే
గని తనుఁ జేరుచిల్కపయిఁ • గన్బొమలన్ ముడివేసి, మీనకే
తననిశితాస్త్రజాలములఁ • దద్దయు మానము దూలియుండఁగాన్. 98

గీ. నర్మసఖి వచ్చి యటకోర్తు • నాఁతిమిన్న, తెఱఁగు మఱి గేమియును లేక • తెలిసి చతుర
భాషణంబుల నిట్లని • పలుకఁదొడఁగె, నంబుజాక్షికి శ్రోత్రప్రి • యంబుగాఁగ. 99

కం. పిలిచినఁ బలుకవు, మోమునఁ, దిలకం బేనియును సరిగ • దిద్దవు, నిన్నుం
దలిమాడ్కిఁ జూచు చిలుకలఁ, దలఁపవు, నీకిట్టిచెయ్ది • తగవా? మగువా! 100

కం. వారిజదళనేత్రి! యలం, కారమ్ములఁ బూన వేమి • కారణ మిస్సీ
వారున్ వీరున్ నితో, వారేగద యెట్లు లున్న • వారో గనుమా. 101

కం. రాముఁడఁట సర్వగుణా, రాముఁ డఁట, సతీమనోభి • రాముం డఁట, సు
త్రిమహిత వంచు నీపై, వ్యామోహత వచ్చియున్న • వాఁడు మృగాక్షీ! 102

గీ. తాటక నొకేటులో జము♦వీటియందుఁ, బ్రాఁత కాఁపుగఁ జేసిన♦ప్రౌఢుఁ డితఁడు
ఈమహాత్మున కీచాప♦ మేమిలెక్క, యితరరాజుల యట్టిఁడే♦ యీతఁ డబల !

ఉ. లేమరో! యెందు కింక నవ♦ లీలగ నీహరకార్ముకంబు నెం
తే మదమొప్పఁ ద్రుంచి, భవ♦ దీయులు కౌతుకవార్ధిఁ దేల నీ
రాముఁడె కూర్మి నీదగుక♦ రంబు గ్రహించెడుఁ, గానిచో మహో
ద్దాముఁడు గాధిసూనుఁడు వృ♦థా యిట కీమహనీయుఁ దెచ్చునే? 104

శా. తుల్యుండో దయితుండు కల్గెనని సం♦తోషించుటో! నేత్రసా
ఫల్యం బొప్పఁగఁ జూచుటో! యతనికై♦ ప్రార్థించుటో! కాక, యీ
కల్యాణం బగుకాలమందున వృథా♦గా నీకతిన్ జిత్తవై
కల్యంబా? నినుబోటి బోటి కిటు లో♦ కల్యాణి! యర్హంబొకో! 105

గీ. రాముఁ డనఁగను భువనైక♦ రత్న; మట్టి, వానికై నీవు వెదుకంగ♦ వలసియుండ
నిన్నె యాతండు కోరుచు♦ నున్నవాఁడు, సంబరంపడవే యింకఁ♦జంద్రవదన!

సీ. సరయూతరంగిణీ♦సలిలాగతంబులౌ, పవనాంకురంబులు♦ పైకొనంగ
అత్యంతశుభ్రంబులౌ♦ పూర్ణిమాచంద్ర, చంద్రాతపంబులు♦ శ్రమలువాఁప
సహకారపల్లవా♦స్వాదకషాయిత, కంఠలౌచుం బికాం♦గనలు పాడ
విమలలతావితా♦నములు వాతాందోళి,తంబులై పుష్పవ♦ర్షంబు గురియ

గీ. మందిరారామముల లతా♦మండపముల, రహిఁ జెలంగఁగ మధుమాస♦రాత్రులందు
వీనితో సౌఖ్యవారాశి♦లోనఁ దేల, నభిమతము కాదె నీకుఁ బ♦ద్మాయతాక్షి!

క. లోకనుతుం డితఁడు నినుఁ, జేకొనఁగా రాఁగ నీవు♦ సింపాలన్ నీవా
లోకింప వేల? "సిరిరా, మోకా లొడ్డంగఁ జామ♦ మూఢులు గలరే?" 108

సీ. ఎడఁబాయ పెట్టిదో♦ యెఱుఁగక నిత్యంబు, గాఢానురాగసం♦గతిఁ దనర్చి
పలుకరించినఁ బెద్ద♦ పులిమాడ్కిఁ బైరాక, స్మితపూర్వమధురభా♦షిత్వ మూని
ఎవ్వరిపై భేద♦మే లేక సర్వత్ర, దక్షిణనాయక♦త్వమ్ముఁ దాల్చి
మెలఁత నెమ్మనములో♦ మెలఁగెడునట్లు సౌ,శీల్యాదిసద్గుణ♦శ్రీ వహించి

గీ. కంటి కెంతయు నింపయి♦ కళ లెసంగి, వలచి వలపించుకోఁగల♦ వాఁడు జవ్వ
నంబు గలవాఁడు, గలవాఁడు♦ నాథుఁడౌట, యంబుజాక్షుల పూర్వపు♦ణ్యంబు కాదె.

వ. అని యిట్లా కలకంఠి, తదీయగుణకీర్తనంబు గావించి శ్రీరామునియందు
దితఃపూర్వంబె ప్రవృత్తానురాగయై, హరకార్ముకారోపణంబుఁ గావించునో లేదో

యని సంశయించు భర్తృదారిక మనశ్శల్యంబుఁ బోఁద్రోచిన, నమ్మగువయుఁ గించిదంతర్గతానంద యగుట మోమునం గనుంగొని మెల్లమెల్లన మఱియు నిట్లనియె.

సీ. మలినవస్త్రంబు లి ♦ మ్మాడ్కిఁ గట్టఁగ నేల, యతివరో లేవె పీ ♦ తాంబరములు ?
తొడవులు నెమ్మేనఁ ♦ దొడఁగ వేల లతాంగి, కఱవాయెనే యలం ♦ కారములకుఁ ?
దల దువ్వకొనవేల ♦ ధవళాక్షి ! నీయాన, చెల్లింపదొక్క దా ♦ సీజనంబు ?
ఇంపుమై ఘుమఘుమా ♦ యింపఁ బూయవదేమి, చాన ! లేదే నీకుఁ ♦ జందనంబు ?
గీ. ఎందుకు విచారమందెద ♦ విందువదన, సమయమిది కాదు విడువు వి ♦ చారమునకు
అదిగొ ! తెచ్చుచున్నారు ♦ హరధనుస్సు, వచ్చుచున్నది నీస్వయం ♦ వరము నేఁడె.

క. విను, మేల యిఁక స్వయంవర, మునకుం దగినట్టి వేష ♦ మును బూను, మిటుం
డిన నిన్నుఁ జూతు రెవ్వరు ?, కనువారికి ముద్దు మూట ♦ గట్టఁగవలదే. 112

వ. అని యిట్లు పలికి దా సన్నమాటల కచ్చెలువ యంగీకారసూచకంబుగా, మౌనముద్ర వహించుటం జూచి, ప్రక్కనున్న చెలికత్తెలకుం గనుసైగఁ జేసినయంత,

సీ. పున్నమచందురుఁ ♦ బుఱడింప నన్నట్లు, తిలకమ్ము మోముపై ♦ దిద్దె నొర్తు
దర్పకబాణౌఘ ♦ దళితాంగి యన్నటుల్, తుఱుమునఁ గ్రొవ్విరుల్ ♦ దుఱిమె నొర్తు
ఎదుట నద్దముమాడ్కి ♦ నినుఁ జూతు వన్నట్లు, నిల్వుటద్దము ముందు ♦ నిలిపె నొర్తు
చిక్కులు తీఱు, ని ♦ శ్చింత నీకన్నట్లు, వాసిమైఁ దలచిక్కుఁ ♦ దీసె నొర్తు
గీ. డంబుమీఱెడు చీనిచీ ♦ నాంబరంబు, పేర్మిఁ గొనివచ్చి తాఁ గట్టఁ ♦ బెట్టె నొర్తు
పైఁడిసొమ్ములు మెయిఁ బొందు ♦ పఱచె నొర్తు, సహజలావణ్య యైన యా ♦ చంద్రముఖికి.

గీ. సంతసము మీఱ నిటు వయ ♦ స్యాజనంబు, చేత సమ్యగలంకృత ♦ గాత్రి యగుచుఁ
జాన రాజిల్లె శ్రీరాము ♦ పైన నేయ, స్మరుఁడు దాల్చిన మోహనా ♦ స్త్రంబనంగ.

వ. అంత వచ్చుటు జనకుండును వీరభటానీతమైన యాహరధనువును విశ్వామిత్రునకుఁ జూపించుచు నిట్లనియె. 116

క. కనుఁగొంటివె యీ బాణా, సన మేగా మున్ను పాక ♦ శాసనముఖ్యుల్
వినుతించుచుండఁ, ద్రిపురం, బును క్షణమున భస్మశేష ♦ ముగఁ జేసె మునీ ! 117

క. కోపించి పిలువలేదని, కా ! పాకారాతిముఖులఁ ♦ గడఁద్రోచి భుజా
టోపం బలరఁగ శివుఁ డీ, చాపంబున నాఁడు దక్షు ♦ సవనముఁ జెఱచెన్. 118

ఉ. భాసురమైన యిద్ధనువుఁ ♦ బట్టి కదా ! ఫణిభూషణుండు, భ
స్మాసురు, నంధకాసురు, మ ♦ హాసురులన్, మఱి యెంతమందినో

గాసి యొనర్చి యొక్కక్షణ ♦ కాలములోపలఁ జంపె, దీనిఁదా
పాసియుఁ గన్నెయుం దెలుప ♦ వారిజసంభవుఁడేనిఁ జాలునే ? 119

మ. గరుడుల్ సిద్ధులు సాధ్యులున్ త్రిదశులున్ ♦ గంధర్వులున్ యక్షకిం
పురుషుల్, కిన్నరు, లెందఱెందఱొ మహీ ♦ పుత్రిం గొనన్ వచ్చి దు
ర్భరమౌ నీ విలు వంపలేక కదలిం ♦ పన్ గూడఁ జేఁగాక పో
యిరి స్వర్గం బెటు చూచువార మని యెం ♦ తే నాత్మ లజ్జించుచున్. 120

శా. ఈచాపం బొక లెక్కయా యనుచు నెం ♦ తేఁ ద్రుంచువారింబలెన్
వాచాటత్వముఁ జూపి తాఁకి విలు వం ♦ పన్ లేక స్వర్ణాద్రిస
ధ్రీచీనంబని యెత్తలేకయె ధరి ♦ త్రీనాథు లట్లెందఱో
మాచేఁ గాదని వారు; మర్త్యులకు సా ♦ మాన్యంబె సంధింపఁగన్ ? 121

క. ఐనను జూపింపుఁడు నృప, సూనుల కీవిల్లుఁ ద్రుంచు ♦ చోఁ దత్క్షణమే
మౌనీంద్ర ! కౌతుకంబున, జానకి నిడి నేఁ గృతార్థ ♦ జన్ముఁడఁ గానే ! 122

వ. అని యిటు గాధినందనునితో వచించు సజ్జనకేంద్రువాక్యంబులకు రాముం
డంతరంగమున. 123

ఉ. ఈవిలు నెక్కుపెట్టుటకు ♦ నింతగఁ జెప్పుచునుండె నీధరి
త్రీవరుఁ డేమికష్టమొకో ♦ దీనిని ద్రుంచెడువారె లేరుగా ?
భూవలయంబునందుఁ గల ♦ భూపతు లంతటిహీనులా ? యస
ద్భావము, మాన్యుఁ డీతఁ డిటు ♦ పల్కుట కేమినిమిత్తమోగదా ! 124

గీ. చానపైఁబేర్మి దుర్బలు ♦ లైననృపులు, వచ్చి విలుఁ ద్రుంప లేకపో ♦ వచ్చు; బలము
పెచ్చు గలవారు రాకపో ♦ వచ్చు; దాని, వలన నీగతి వచియింప ♦ వలె నిశంతు.

మ. అని చిత్తంబున నెంచుచున్ ధనువుపై ♦ నక్షుల్ ప్రసారించుచున్
జనకున్ జూచుచు దేశికోత్తము నను ♦ జ్ఞాలబ్ధికై వేఁచుచున్
ఘనమౌ స్వీయభుజాబలంబుఁ దెలుపం ♦ గా నెప్పుడా యెప్పుడా
యనురాముం గనిపెట్టి మైథిలునితో ♦ నాకౌశికుం డిట్లనున్. 126

గీ. గరుడు లెవ్వరో యక్షకిం ♦ పురుషు లెవరో, సాధ్యు లెవ్వరో సురలెవరో ♦ చంద్రముకుటు
కార్ముకాకర్షమునఁ గొఱ ♦ గాములైన, యంతనే యియ్యది యసాధ్య ♦ మనఁగ వలెనె ?

మ. అలగీర్వాణులె మిన్నలొక్క ! హరి లేఁ ♦ డా వానికిం బైనివా
రల్లు లేరా ! మఱి వారిపైన ఘనుఁగు ♦ రాఘుం ధుధార్యుండు ని

ర్మలుఁడా విష్ణువు లేఁడె! పార్థివమణీ! ♦ త్రాఁడెక్కునత్వానికిన్
దలఁ దన్నంగలవాఁడునుం గలఁడు కా ♦ దా యెందు కీతొందరల్? 128

సీ. ఏకవింశతివార ♦ మెల్లరాజుల నాజిఁ, జెండినమేటి మ ♦ ర్త్యుండు కాఁడొ?
జలజంతువులతోడ ♦ సంద్రంబు చిటికలోఁ, గ్రోలినమౌని మ ♦ ర్త్యుండు కాఁడొ!
త్రిజగంబునుం బద ♦ త్రితయమ్ముచేఁ గొన్న, దండిమగండు మ ♦ ర్త్యుండు కాఁడొ!
అనరాదు కాని నా ♦ తనసృష్టిఁజేసి పెం, పొన్నయాతండు మ ♦ ర్త్యుండు కాఁడొ!

గీ. మర్త్యులే కారె వీరు సా ♦ మాన్యమైన, పనులె యేతత్కృతంబులు ♦ పార్థివేంద్ర!
యెందుకీవిల్లుఁద్రుంపఁగా ♦ నెందుజన్మ, మెత్తియున్నాఁడొ! యేపురు ♦ షోత్తముండు?

గీ. మానవుల కెందు నిది సాధ్య ♦ మాయటందు, మానవులనంగ నంతపైఁ ♦ బైనఁగలరె?
యెవ్వ రెఱుఁగుదు రేపుట్టు ♦ నేమిగలదొ!, రాముఁడే దీని నెక్కిడ ♦ రాదె యిపుడు.

వ. అని యిట్లు నిజవాక్యఖండనం బాచరించునమ్మునీంద్రునకు, నమ్మహీ
మహేంద్రుం డిట్లనియె. 131

ఉ. వీఁక మెయిన్ విలున్ విఱువ ♦ వీరులునుంబలె వచ్చి యెందఱో
రాకొమరుల్, వృథాశ్రమభ ♦ రంబునఁ బోవుటఁజేసి యంటి నే
నీకరణిన్ మదిన్ విసిగి ♦ యీరఘురాముఁడె యెక్కువెట్టుచో
నా కిఁక సంతకంబెను ఘ ♦ నం బగుకౌతుక మేమి కౌశికా! 132

గీ. జానకీదేవి శ్రీరామ ♦ చంద్రుతోడఁ, బాణిపీడనసౌఖ్యంబుఁ ♦ బడసెనేని
శ్రీమహాలక్ష్మి, లోకైక ♦ సేవ్యమానుఁ, డైననారాయణునిబొంది ♦ నట్లుగాదె. 133

క. ధన్యుం డీతఁడె విలునా, జన్యం బలరారఁ బేర్మి ♦ సంధించినచో
నన్యాలోచన లేటికిఁ, గన్యారత్నంబు నేను ♦ గానుక యీనే. 134

క. అని యీగతి జనకుఁడు తనుఁ, గనుఁగొనియత్యంతభక్తి ♦ గౌరవములతో
ననుడు, మునీంద్రుఁడు రాముఁ, గనుసన్నన్ సంధిసేయు ♦ కార్ముక మనినన్. 135

గీ. చాప మెక్కిడనా మహో ♦ త్సాహ మొకట, సీతఁబెండ్లాడనయ్యెడు ♦ సిగ్గొకటఁ
జేరి నృపు ముందు వెనుకాడఁ ♦ జేయుచుండ, నాలసించుడు వనుఁ గుశి ♦ కాత్మజుండు.

గీ. కట్టులెందఱో యిది యెక్కు ♦ వెట్టలేక, చనినవారలంతు, వింటిగా! ♦ సంధిసేయు
వేగ నీవిల్లు, జగదేక ♦ వీరుఁ డనెడి, గౌరవము వచ్చు జనకుండుఁ ♦ గన్య నిచ్చు.

మత్తకోకిల.

కాన నావచనం బమోఘము ♦ గా నొనర్పుము, కన్యకా
దానపూర్వముగా నృపాలుఁ గృ ♦ తప్రతిజ్ఞునిఁ జేయుమా

మానసంబున నొండు చింతను ♦ మాను నీకె శుభంబగున్
బూనుమా హరచాపమున్ నిను ♦ బోటి కేటికి జాగికన్ ? 138

వ. అని గురువరుండు తొందరించుటయుం, దనకుఁగూడఁ దదాకర్షణోత్సాహ మతిశయించుటయుఁ దలంచి యా రామచంద్రుఁడు ధనురారోపణంబుఁ జేయ నిశ్చయించి గురువరేణ్యున కెఱఁగి మందసకడ కేతెంచిన,— 139

సీ. కార్ముక మెత్తఁగాఁ ♦ గడఁగెఁ గానీ యిది, కొనసాగునా యను ♦ కొనెడివారు
మనసీత కంతటి ♦ మాత్ర మెంకొ! మహా,లే యని గుసగుసల్ ♦ సేయువారు
ముని యవివేకియా ♦ కొనిరాఁగఁ దోసిరా, జనఁజెల్ల దీమాత్ర ♦ ననెడువారు
ఏపుట్టలోపల ♦ నేపాము గలదో! యె, వ్వఁడు సెప్పఁగలఁడని ♦ నుడువువారు
గీ. ఏల జగడంబులాడెద ♦ రింతులార, పండొ! కాయయొ! యిప్పుడే ♦ బయలుపడును
లెండనుచు సారెకును మంద ♦ లించువారు, నైరి యంతఃపురాంగన ♦ లందునపుడు.

క. సీతయు నిదివఱకె వయ, స్యాతతిచే వినియు, రామ ♦ చంద్రుని సత్వం
బాతతి నంతయు మఱచుచు, జాతద్వాపరమునైన ♦ స్వాంతముతోడన్. 141

మా. ఈవి ల్లీమహనీయుఁ డెక్కిడనిచో ♦ నే నేమి కాఁజెల్లు, నా
భావం బొక్కరితోడఁ జెప్పుటయు స ♦ ద్భావంబు కా, దక్కటా
పూవిల్తుండుఁ బదేపదే చెనకు, నే ♦ బో ల్లాదురో నామనో
దావాగ్నిన్ శమియింపఁజేసి శుభమం ♦ దన్ జేయఁ గాదంబినుల్ ? 142

గీ. చెలు లెఱింగిన నెగతాళిఁ ♦ జేయ రెంతు;రోరులు విన్నను బాగుగా ♦ నుండ; దెటులు
గోర్కి కొనసాఁగు నీమునుఁగులో ♦ గ్రుడ్డులాట, యయ్యోఁ బోనాదుచరితమ ♦ య్యయ్యొయ్యొ

క. ఈరీతిగఁ జింతిలు నా, నారీమణి కదరె, వామ ♦ నయనంబు శుభ [నేఁడు.
స్ఫోరకమై, సందేహా న్వి, వారకమై వాంఛితార్థ ♦ ఫలపూరకమై. 144

వ. అంత నక్కాంతయు హర్షితస్వాంతయై, పురుషులకు దక్షిణనయనాస్పందం బుంబోలెఁ, బూఁబోండ్లకు వామనయనాస్పందంబు శుభప్రదంబ యందురు, నాకుం జూడ రామచంద్రపాణిగ్రహణంబుకన్న మఱొండు సుఖదాయకంబు కానేరదు, నాకి య్యది యానందంబు సమకూర్చునే యనియు నట్లేలకాదు, పండితులవాక్యంబులు రిత్తపోవు నేయనియు వితర్కించుచు, మఱియు నిట్లనియె. 145

శా. ఎందున్ నీసరివారు లేరుకద! మా ♦ యీ కామినీజాతి కా
నందంబున్ సమకూర్చుపట్టున, నన ♦ న్యం బంధ్రు నీశక్తి, యే

చందానఁ దన రాముఁడేశ్చదవో! యీ ♦ సర్వంబు నీదే నన
స్పందోహంబు లొనర్తు వామనయనా ♦ స్పందంబ! నీ కెంతయున్. 146

క. అని యిట్లు పలుకుసీతం, గని యారాధార్పంగ నొక్క ♦ కామిని పజ్జం
జెనిమిటి నరసెదుకోకాం, గనఁ గని యన్యాపదేశ ♦ కముగా ననియెన్. 147

గీ. వల్లభుని నీకుఁ గూర్పఁగా ♦ వచ్చియున్న, వాఁడు చూడుమదే లోక ♦ బాంధవుండు
చింతఁ జెందఁగ నేల నీ ♦ చిక్కుదీరు, నైపు మొకక్షణకాలంబు ♦ చక్రవాకి! 148

గీ. పగలు గావునఁ బతి నెడఁ ♦ బాసి పార్శ్వ,తలమునం గుందు వెన్నెల ♦ తొలఁగుబోటిఁ
గాంచి నెచ్చెలి కోదాగ్పు ♦ గాఁగఁబలికె,సరసముగ నిట్లు లోకవయ ♦ స్యాలలామ.

గీ. కేఁడినిట్లార్పు లూరకే ♦ విడిచె దేల, యెట్టులో కొంచె మోపికఁ ♦ బట్టు నీదు
నయనకుముదమ్ములకు మహా ♦ నంద మిచ్చు, నట్టిచంద్రుండు నేఁడు రాఁ ♦ డా! చకోరి!

చ. అని యిటుభర్తకై వగచు ♦ నప్పు, డహేతువుగాఁగ వామలో
చన మది స్పందమాటయు, నె ♦ సకే దనకార్యము సిద్ధిఁబొందున
ట్లనువుగ నెచ్చెలుల్ పలుకు ♦ నప్పలుకుల్ శ్రవణద్వయీరసా
యనమయి యుంటయున్, సుఖప ♦ యోంబుధి జానకి తేలియాడఁగన్. 151

గీ. ఇంకఁ గొందఱు చెలికత్తె ♦ లేల సమ్ము, ఖంబునందున రాయబా ♦ రంబు లిట్టి
యొడనె యన్యాపదేశంబు ♦ లింతులార! తెల్లముగఁ జెప్పుఁడీ తత్త్వ ♦ మెల్ల ననుడు.

ఉ. ఒక్కలతాంగి యష్టపుడె ♦ యొక్కపటంబున రాము వ్రాసి యా
ప్రక్కనె జానకిం గనుల ♦ పండువుగా లిఖియించి, చూపఁగా
నక్కమలాక్షి యేల పరి ♦ హాసములాడుదు రంచు లజ్జ, నా
చక్కఁదొలంగిపోయె, నెక ♦ సక్కములాడఁ దనుం దలోదరుల్. 153

శా. పున్నాగంబును వ్రాసి మాధవికిఁ బ్రా ♦ పుం జేయ రమ్మంచు నా
సన్నాళిం బిలువంగ నావె, ధరణీ ♦ జన్ బల్కె శ్రీరాముఁడే
పున్నాగంబన, నీవె మాధవి యనం ♦ బోటీ మిముం గూర్పఁగా
సన్నాహం బొనరించు మాజనకుఁ డీ ♦ సర్వంబు నీ కేటికిన్. 154

ఉ. ఏమనినన్ జెలుల్ తనునె ♦ యొక్క సకెమ్మొనరింప, తేచి యా
రామసమీప మేగుదము ♦ రమ్మని యొక్క వయస్యఁ బిల్వ, నా
రాముఁడె నీదుసన్నిధికి ♦ రాఁగలఁ డేల శ్రమింతువంచు, న
క్కోమలి పల్కుడున్; సఖులు ♦ గొబ్బున నవ్విరి యొక్క పెట్టునన్. 155

క. ఈపగిదిఁబల్కు సఖ్యా, లాపమ్ములు లోఁ గుతూహ ♦ లమ్ము నొసఁగినన్
గోపమ్ముఁ బయికిఁజూపెడు, భూపుత్త్రిక కనియె నొక్క ♦ భూఁబోఁడి వడిన్. 156

గీ. ఉన్నమాటకు నలుక కొక్క ♦ వన్నమాట, నిక్కవం బయ్యె నేఁటికి ♦ నీదుపట్టఁ
బంకజాక్షిరో! ముంజేతి ♦ కంకణముల, కద్దమేటికి సకల మీ ♦ వరయఁగలవు.

వ. ఇట్లు వారు మాటలాడికొనుచుండ నచ్చట రాముండును గురువరేణ్యునకు నమస్కారంబుఁ గావించి, యెల్లరుఁ జూచుచుండ, 158

సీ. మిథిలేశ్వరుఁడు ముక్కు ♦ మీఁద వ్రేలిడికొని, యనిమేషదృష్టియై ♦ యరయుచుండ
విల్లిమహాత్ముఁడే ♦ విలుమఁగాకని సీత, యిష్టదైవతముల ♦ కెఱఁగుచుండ
ఈనాఁటితోడనే ♦ యీడేరు నాకష్ట, మని కౌశికుఁడు మోద ♦ మందుచుండ
ఇందరిచేఁగాని ♦ యిది వీనిచే నగు, నా? యని చూచువా ♦ రనుచునుండ

గీ. లీలఁ గార్ముక మొకకేల ♦ లేవనెత్తి, నారి సంధించి యాశ్రవ ♦ ణంబు లాఁగఁ
బ్రళయనిర్ఘాతపాతరా ♦ వంబుతోడ, దిక్కు లదరంగ నది రెండు ♦ ముక్కలయ్యె.

క. ఆమోదమందె జనకుఁడు, భూమిసుతచేత నపుడు ♦ పొలుపుగ, నాశ్రీ
రాము మెడపై, వరుస్యా, స్తోమము వేయించె నవ్య ♦ సుమదామంబున్. 160

వ. అంత జయజయధ్వనులతో మంగళవాద్యంబులు దిగంతంబులం బర్వ స్వయంవరాగతు లగుభూకాంతులు దప్ప, నెల్లరును హర్షితస్వాంతులైరి యంతమిథిలావనీశ్వరుండును గల్యాణంబు నిర్వర్తింపఁ గౌశికానుమతంబునఁ దనమంత్రిసత్తముల దశరథునకువార్త దెలిపి వివాహమహోత్సవంబునకుఁ దోడ్కొనిరా నయోధ్యకుం బనిచిన.

తోటకవృత్తము.

సమరావనినిర్జిత ♦ శత్రుగణా!, సుమనోగణకీర్తిత ♦ శుద్ధగుణా!
ప్రమదాజనమానస ♦ పంచశరా!, నమదార్యగణార్తివి ♦ నాశకరా! 162

క. నిరుపమబల! పిత్రాజ్ఞా, పరిపాలనబద్ధదీక్ష! ♦ పద్మదళాక్షా!
ఖరదూషణాదినక్తం, చరభయదాంభోదజాత ♦ ఝంఝావాతా!. 163

పృథ్వీవృత్తము.

సరస్వదురుమేఖలా ♦ సకలభూమిభూమీతలే
ట్కిరీటమణిసత్ప్రభా ♦ కిరణరాజినీరాజితా!
నిరంతరమునీణ్మనో ♦ నిలయభాసురా! శాంబరీ
తురంగపరిమారకా ♦ కువలయేష్టసంపూరకా! 164

ఇది ........................................ శ్రీపల్లె పూర్ణప్రజ్ఞకవి విరచితం బగుశ్రీరామకళ్యాణమునఁ జతుర్థాశ్వాసము.



శ్రీహయగ్రీవాయ నమః

# శ్రీరామకల్యాణము

## పంచమాశ్వాసము



శ్రీమహీతనయాలంకృత
వామాంగ! కృపారసప్ర ♦ వర్షదపాంగా!
కామితఫలదా! సుగుణా
రామా! రణవిజితపరశు ♦ రామా! రామా! 1

వ. దేవా! యవధరింపు మట్లు జనకప్రేషితులై యమ్మంత్రిపుంగవులు ఓన దినప్రయాణంబుల దివసత్రయంబున నయోధ్యం బ్రవేశించి యందు సుతవిరహంబుచేఁ గుందు దశరథేశు వీక్షించి కృతప్రణాములై సవినయంబుగా— 2

సీ. తాటకామూలవి ♦ ధ్వంసంబు కౌశికా, రబ్ధమహాధ్వర ♦ రక్షణంబు
క్రూరసుబాహుని ♦ గూల్చిననాఁటియా, లంబు మారీచప ♦ లాయనంబు
మితమునికోటితో ♦ మిథిలాప్రయాణంబు, మునిసతీశాపవి ♦ మోచనంబు
ఫాలలోచనధను ♦ ర్భంగవృత్తంబుఁ బ్ర, థ్వీతనయాపాణి ♦ పీడనంబు

గీ॥ మున్నుగాఁగల శ్రీరామ ♦ మూర్తివర్తనంబులను దెల్పి సుతవివా ♦ హమ్ముకొఱకుఁ
దమ్ము జనకావనీశుండు ♦ తత్క్షణంబు, పిలిచిరమ్మని యిచటి కంపిరని తెలిపి. 3

మత్తకోకిల. సమ్మదం బెదఁ దొల్కరింపఁగ ♦ సర్వబంధుసుహృత్సమే
తమ్ముగా, ససతీసుతుండయి ♦ తద్వివాహముఁ జూడఁగా
రమ్ము జా గొనరింప నేటికి ♦ రాజచంద్ర "శుభస్య శీ"
ఘ్రమ్మనన్ వినియుండలేదె వి ♦ కర్తనాన్వయమండనా!

క. అవి యాగతిఁ దృషితునకున్, ఘనతరపీయూషవృష్టి ♦ కరణిన్ వారున్
దనయత్రపాకలితుం డగు, జనపతికి సుధామయోక్తి ♦ సరణి నిటాడన్॥ 5

క. ఆయనఘున కది కర్ణర, సాయనమై యింపు నింప ♦ నాతఁడమే స్వ
శ్రేయస మెఱిఁగించినయా, ధీయుతుల కొసంగి రత్న ♦ దివ్యాంబరముల్. 6

క. మునివరుచేతను నచ్చెరు, వును సంతోషంబు గలుగ ♦ భూపాలుఁడు, నె
మ్మనమున నిట్లని తలపో, సెను నానందాశ్రు లతి ♦ సీమలఁ గ్రాలన్. 7

చ. తనయులఁ గొంచుఁ బోవుతటిఁ ♦ దద్విరహంబు సహింపనున్న నా
మనమున కూఱటన్ గొలుప ♦ 'మానవనాయక! వత్తుఁ, బ్రాప్తశో
భను లగుపుత్త్రులన్ గనుల ♦ పండువుగా నచిరంబులోనె గ
న్గొనియెదుగాక' యం; చటులె ♦ గూర్చెను గాధితనూజుఁ డన్నటుల్. 8

చ. తగువచనమ్ములన్ దనయుఁ ♦ దా నొనరించెడునధ్వరంబు, నో
మఁగఁ బిలువంగ, లేనియను ♦ మానముఁ జెందుచు, నాత్మజాతు సం
పఁగ వెనుదీయువాక్యములు ♦ పల్కితి నప్పుడు, నేఁటి కింక నే
మొగమున నాతపోధనుని ♦ ముంగలకున్ జనువాఁడ నక్కటా. 6

గీ. అనుచుఁ గౌశికు నెటుగనుం♦గొనెడువాఁడ, ననుత్రిప ప్రయాణమున వెను♦కంజ వేయ
సుగుణరత్నాకరంబులౌ♦సుతులఁ జూచు, కాంక్షమాత్రంబుముందుకు♦గంతులిడఁగ.

వ. ఎట్టకేలకు మిథిలాప్రయాణంబునకుఁ గృతనిశ్చయుండై వసిష్ఠాదిగురుజనం
బులయానతి నయోధ్యాపురం బలంకరింపఁజేసి పౌరులకు శ్రీరామకళ్యాణంబుఁ జాటఁ
బంచి యమ్మఱువాఁడు శుభముహూర్తమున 11

సీ. పార్శ్వభాగంబుల ♦ భటు లుండి రాజచిహ్నము లగువింజామ ♦ రములు వీవ
దిక్కులు వెలుగొంద ♦ నొక్కఁడు చంద్రికా, తతధవళాతప ♦ త్రంబు పట్ట
మన్ననమై నొక్క ♦ మదపుటేనుఁగు నెక్కి, భరతశత్రుఘ్నులు ♦ ప్రక్కరాఁగ
"విజయతాం దశరథో ♦ ర్వీధవ" యనిపల్కు, బందిమాగధులొక్క ♦ వైపుఁ దనర

గీ. హితులతోడను నిజపురో♦హితులతోడ, మునులతోడను స్వీయకా♦మినులతోడ
మంగళధ్వానముల మిన్ను♦మాఱుమ్రోగఁ, దరలెమిథిలాపురమునకు♦దశరథుండు.

గీ. ఈపగిది వేడ్కతో మిథి ♦ లాపురంబు, దినచతుష్టయమున కేఁగ ♦ జనకుఁ డంత
నెదురుగా వచ్చి కొంపోయి♦మది ముదంబు,గడలుకొన,వారి నొక మంచి♦విడిదిఁ జేర్చి.

ఉ. ఎన్నఁటికిం దరించితిని ♦ నెన్నిదినాలకు మిమ్ముఁ జూడఁగాఁ
బున్నెముఁ జేసికొంటి, ముని ♦ పుంగవు లిందఱు చూడనైరి, నా
జన్మము పూజ్యమయ్యె, నృప ♦ సత్తమ! నీతొలిపట్టి కింక నా
కన్నియ ధర్మచారిణిగఁ ♦ గైకొని నన్నుఁ గృతార్థుఁ జేయవే. 14

క. భూతలపతి రాముఁ డనఁగ, జాతుఁగఁ బడసితివి నీదు ♦ జన్మము మించెన్
గౌతుకమున నాకుఁ జా, మాతనుగాఁ జేసి చేయు ♦ మా నను ధన్యున్. 15

క. ఏతద్గతి ననుజనకుని, క్ష్మాతలపతి పలుకు దీని ♦ కైనను, నీవీ
రీతిఁ బలుకంగ నేటికి, నీతో బాంధవ మపేక్ష ♦ ణీయము కాదే. 16

గీ. పూవు లెందున్న వెదకుచుఁ ♦ బోవు తేంట్లు, కాని వెదకవు పూలె భృం ♦ గములకొఱకు
వసుమతీనాథ! యుత్తమ ♦ వస్తు వెపుడు, వెదకఁబడుఁగాని తనకుఁ దా ♦ వెదుక దొరల.

ఉ. కోడ లయోనిజాత, జన ♦ కుండు ప్రదాత, గురుండు బ్రహ్మపై
వాఁడిది కూర్పఁ బాల్గొనిన ♦ వాఁడు, మదగ్రసుతుండు భర్త, లో
కేడితుఁడౌ వసిష్ఠుఁడు మ ♦ హిష్ఠుఁడు వీరల పెండ్లిపెద్ద, యె
వ్వాఁ డిఁక నన్నుఁబోలఁగల ♦ వాఁడు ధరన్ మిథిలావనీశ్వరా! 18

క. అని యన్యోన్యం బిట్లను, కొనుచుండఁగ వచ్చెఁ గౌశి ♦ కుం డచ్చటికిన్
జననాథుని గనువేడుక, దనరఁగ మునిజనులు గొలువ ♦ దాశరథులతోన్. 19

వ. అంత నారాజోత్తములును నాసనంబులనుండి లేచినవారై, విధివిధానంబున నర్చించిన మునీంద్రుండును దనముఖంబుఁ జూడలేక యధోముఖుండై యుండు దశరథు వీక్షించి కుశలప్రశ్నానంతరమున— 20

చ. జనవర! నాఁడు నీదు తను ♦ జన్మల నన్యులమాడ్కి నెంచుచున్
బనుపఁగ సంశయించితివి ♦ బాలురటం చకృతాస్త్రులంచు నా
దనుజులఁ ద్రుంచలే రనుచు ♦ దైత్యులు దుండగులంచుఁ బల్కుచున్
గనుఁగొనినావె యిప్పుడయి ♦ నన్ దనుజన్మల శక్తి యెట్టిదో. 21

క. తాటకపే ర్విన్నను నే, గాటరికేనియును గుండె ♦ గడగడ, యా క
ర్కోటుకి వీఁగొమరుం డొ, క్కటున నవలీలఁ గూల ♦ నేసె నృపాలా! 22

క. మారీచసుబాహుల నా, సీరంబున నెదురఁ దరమె ♦ చిచ్చఱపిడుగుల్;
వారలలో నీసుతుఁ డొక, వీరు నుదధి ముంచె, నొక్క ♦ వీరుం ద్రుంచెన్. 23

ఉ. కంటికిఁగూరుకే తడవు ♦ గా నిఁక నేచునువాఁడ నా జగ
త్కంటకులౌ నిశాచరులె ♦ కన్నుల మెల్గుచునుందు, రల్లము
క్కంటి యెఱుంగు మామఖ; మి ♦ కంగద కంటికి నిద్ర గల్గి, యా
కంటికి నన్నమున్ దిని సు ♦ ఖంబుగ నుండుట మాకు భూవరా! 24

వ. అదియునుంగాక— 25

క. ఇంపుగ నీకొమరుఁడు ధర, గంపింపఁగ సిద్ధసాధ్య ♦ గణములచేతన్
వంపఁగఁ ద్రుంపఁగ మఱి కద,లింపఁగలేనట్టి విల్లు ♦ లీలన్ ద్రుంచెన్. 26
క. దానన్ జనకమహీశుఁ డ,నూనానందమ్మునన్ ద ♦ నూజను యథావ
త్స్నానున కీయఁగ నిన్నా,హ్వానం బొనరించెఁ దద్వి ♦ వాహముఁ జూడన్. 27
క. మీరు రవివంశభవులరు, వీరున్ జంద్రాన్వవాయ ♦ వీరులు; మీరున్
వీరును వియ్యముఁ గొన బం,గారునకుం దావి యబ్బు ♦ కరణియ గాదే. 28
గీ. చూతువో పరిణీతులౌ ♦ సుతులనంచుఁ, బలుక నాశీర్వచఃపరి ♦ పాటి నేఁడొ
యదియు సమకూరెఁ గొంత నీ♦యగ్రసుతుఁడు, పెండ్లికొడుకాటఁజేసి పృ♦థ్వీబిడౌజ!

వ. అని కౌశికుండు పలుకు నవసరంబున, నందుండి లేచి జనకుండు సాంజలియై.

గీ. కొంత సమకూరెనంచు మీ♦రెంతమాట,పలికితిరి ? మిధ్యయున్నె మీ♦పలుకులందు
నంతయును సమకూరుఁబో ♦ నర్థజరతి, గానవచ్చునె మునులవా ♦ క్యంబులందు.
క. కాదనునే మీయాశీ,ర్వాదము విధియేని, మౌని ♦ వర ! పొల్లైనం
బోదు భవదీయవచనము, నాదగునిశ్చయము యిది వి ♦ నన్ వలె దీనిన్. 32
గీ. మీకు సమ్మతమైన నూ ♦ ర్మిళను లక్ష్మ,ణునకు మాండవీశ్రుతకీర్తు ♦ లనెడివారి
భరతశత్రుఘ్నులకు నిచ్చి ♦ పాణిపీడ,నంబుఁగావింతు, ననుజూచి ♦ త్తంబు నిదియ.
గీ. నావుడుఁ "దథాస్తు"నియె శతా♦నందుఁడంత,నవనిజాని కృతార్థోస్మి ♦ యనియె,మౌని
"సదృశ మేత ద్భవాదృశు♦చంద్రవంశ్య,పార్థివాగ్ర్యేషు తత్రాపి♦భవతి"యనియె.
క. అంతట సభ్యులు నెల్లరు, సంతోషనిమగ్నులైరి ♦ సంయమివరుఁ డా
యంతికగతులౌ ధరణీ, కాంతునితనయులను గూర్మిఁ ♦ గౌఁగిటఁ గొనుచున్.
గీ. తీరిపోయెను నాపైని ♦ భారమెల్లఁ, గొమరులను వీరి భూవరా ! ♦ గొనుమనంగ
బాలకులునంత సాష్టాంగ♦ప్రణతులగుడు, నొడయఁడానందవారాశి♦నోలలాడె.
గీ. చిరవిరహితాంగనాసమా ♦ శ్లేషణంబు, లోకసుశ్లోకసుతముఖా ♦ లోకనంబుఁ
బడయఁగా నోఁచుకొన్న సౌ♦భాగ్యఖనికిఁ, బ్రాజ్యమైనట్టి స్వర్గసా♦మ్రాజ్యమేల?
చ. తనయులు గల్గినంతనె ము ♦ దంబు ఘటిల్లునె? వారు కీర్తిభా
జనులయి శూరులై సకల ♦ సద్గుణశోభితులై విధేయతా
ఖనులయి పేరుగొన్నపుడు ♦ గా పితరుల్ చరితార్థులౌట, వీ
తనయులఁ గన్నయట్టి తలి ♦ దండ్రులకంటె నపుత్రు లుందురే. 38
క. అని తనయాలింగనసం, జనితానందాశ్రుతతులు ♦ జలజల రాలం
గను మౌనివలను వెలాషై, మనుజేశుం డిట్లు మంద ♦ మందముగ ననెన్. 39

మ. కౌమరుం గీర్తిధనుం బ్రొనర్చుటకెగాఁ గొంపోతి రేకాని, వా
సి మహాశక్తిని, సృష్టికట్లు ప్రతిసృష్టింజేయు మీబోంట్లు కా
యమరారాతు లసాధ్యులా? మఱి సుతుం డవ్వారి నిర్జించెనా?
తమ యాశీర్వచనప్రభావ మిది కాదా? గాధిరాణ్ణందనా! 40

గీ. వీరలటులుండ శివువిల్లు విఱిచి సుతుఁడు, రాజిలుట మీకృపాప్రసారణ మెకాదె
తక్కు మణులకుఁదే సూర్యకాంతములె గ్రాల, నైజతేజంబొ రవికిరణంబొ చెపుమ?

వ. ఇట్లన్యోన్యవినయోక్తులఁ బ్రొద్దుపుచ్చుచుండ జనకుండు వివాహ ముహూర్తంబు సమీపించినఁ దద్వృత్తాంతంబుఁ బురంబునం జాటు సేవకులఁ బంచిన నత్తఱి— 42

ఉ. సన్నముఁ గొట్టి గోడలకు శోభలఁగూర్చెడువారుఁ, దోరణా
ల న్నెలకొల్పి యింటికిఁగ శోభ నవిలించెడువారు, వాకిటన్
గ్రన్ననఁ బచ్చఁగా నరఁటి కంబములన్ నిలఁబెట్టువారునై
రున్నతిఁ బౌరు లెల్లరుఁ ద దుత్సవమున్ వినినంతనే పురిన్. 43

సీ. ద్వారంబులందు "సీతారాఘవా విజయేతా" మటంచు వ్రాయించువారు
"మాండవీభరతయోర్మంగళం భవ" తంచు, జెండాల నక్కరాల్ చెక్కువారు
"ఊర్మిళాలక్ష్మణయో శ్శుభమ" స్తంచుఁ, గాగిదాల్ కత్రించి కట్టువారు
"స్యాచ్ఛుభం శ్రుతకీర్తి శత్రుఘ్నయో" రంచు, మించుపందిళులఁ జిత్రించువారు

గీ. తమగృహంబుల జరుగు నుద్వాహమట్లు, తిండియును నిద్దురయు లేక తిరుగువారు
నగుచు నృపునింట నా వివాహంపుఁ బనికిఁ, బౌరు లెల్లరు సంతోషభరితులైరి.

వ. అప్పుడు జనకాజ్ఞానుసారంబుగా శిల్పులును— 45

గీ. పచ్చతానేలపై మేల్మిపసిఁడితోడఁ, గంబములఁగట్టి మణులతోఁ గప్పమర్చి
మనుజనాథుండు కౌతుకంబుఁగొన నిమేష, మాత్రఁగావించిరి వివాహమండపంబు.

క. అంతట నృపునానతిఁ గాంతాంతిక లేతెంచి మూరు తముఁ జెప్పంగా
సంతసమునఁ జెలు లయ్యళి, కుంతలలన్ వేగఁ బెండ్లికూఁతులఁ జేయన్. 47

సీ. మానైన సంపంగి నూనెతోఁ దలలంటి, నలుగురి కొకమాఱు నలుగుఁబెట్టి
వేఁడినీటను స్నానమాడించి మేలైన, ధవళాంశుకములతోఁ దడి నడంచి
కప్రంపుఁ బొడుముతోఁ గలపంబులంగూర్చి, పట్టుపుట్టంబులఁ గట్టఁబెట్టి
కురుల మన్నఁగ దువ్వి క్రొవ్విరుల్ గయి సేసి, కనుల నీటుగఁ గాటుక ఘటించి

గీ. సొగసుగా మోరఁ గస్తూరి చుక్కఁబెట్టి, రాణఁ బసుపును బూసి, పారాణి నలఁది
బుగ్గలందునఁ గాటుక బొట్టుపెట్టి, చేడియ లలంకరించి రాచిగురుఁబోండ్ల. 48

క. అసలే యాలలితాంగులు, కుసుమశరాసనునిచేతి ♦ కోదండము ల
క్లెసఁగుదురఁట తద్రూపము, పస నీకఁజెప్పంగఁ దరమె ♦ బ్రహ్మకునైనన్. 49

వ. ఇట్లాకాంతామణుల నలంకరించిన నటుదశరథుండును వసిష్ఠానుమతంబునఁ బుత్త్రుల శుచిస్నానులం గావించి, భూరిభూషణభూషితులం జేసి, వసిష్ఠాదులు ముందు నడువ మంగళవాద్యంబులు మిన్నుముట్ట శుభముహూర్తంబునకుఁ గళ్యాణమండపంబుఁ జేరవచ్చుడు 50

క. జనకుం డెదురై బాంధవ, జనములతో శుభనినాద ♦ సందోహముతో
మనుజేశుల గొనిచనియెన్, మనమారఁగ నవ్వివాహ ♦ మండపమునకున్. 51

వ. ఇట్లు తోడ్కొని చని రామలక్ష్మణభరతశత్రుఘ్నుల వివాహపీఠంబులఁ గూర్చుండ నియమించి కొంతమంది వృద్ధపురంధ్రీమణులకుఁ గోమార్తెలఁ దోడ్కొని రా నియమించి తాను శతానందునానతి వేదోక్తంబుగా హోమాదుల నెరవేర్చి యంత

క. తార్కొన మూర్తంబు శుభో, దర్కంబుగ మైథిలుండు ♦ తత్క్షణమే యా
యర్కాన్వయమణులకు మధు, పర్కంబులఁ గట్టఁబెట్టి ♦ పర్యుత్సుకుఁడై. 53

సీ. గగనసీమకు నలం ♦ కారభూతుం డంశుమాలి యెవ్వరివంశ ♦ మండనంబు
ఇంద్రునర్ధాసన ♦ మెక్కినయాపురం, జయభూపుఁ డెవరి య ♦ న్వయభవుండు
శక్రార్థ మేకోన ♦ శతమాత్రముఖుఁడైన, ధన్యుఁ డెవ్వారి ము ♦ త్తాతతాత
శ్రీ యెల్ల వృత్పాత్రి ♦ శేషఁ జేసినమహా, ధ్వరకర్త యెవ్వారి ♦ తాతతండ్రి

గీ. ఒక్కఁడ సమస్తరాజుల ♦ నోటుపఱిచి, తరుణిఁగొన్నట్టియజుఁడు నె ♦ వ్వరికిఁదాత
అట్టి దశరథపుత్త్రుల ♦ కస్మదీయ, తనయల నొసంగుకన్న సం ♦ తసము కలదె. 54

క. అని రామున కభిముఖుఁడై, కనులను నానందబాష్ప ♦ కణములు రాలన్
దనయను గొని రామునితో, మనుజేశుం డనియె మంద ♦ మందమృదూక్తిన్. 55

సీ. పదియాఱువన్నె మే ♦ ల్పసిఁడిఁ గేరెడుమేని, నిగనిగల్ గలది యీ ♦ నీలవేణి
ఇల దున్నునెడ నందు ♦ వెలసినట్టి యయోని, జాత యీవికచాంబు ♦ జాతనయన
పుట్టినింటికి మఱి ♦ మెట్టినింటికిఁ గూడఁ, గీరితిఁ దెచ్చు నీ ♦ కీరవాణి
తల్లియా ధాత్రిమ ♦ తల్లికైవడి క్షమా, గుణభాసమాన యీ ♦ గుణవితాన

గీ. పుత్త్రివలె నేమ పెంచిన ♦ పూవుఁబోఁడి, నీడవలె నిన్ను వెంటాడు ♦ నిరుపమాంగి
నవ్వులకునైన బొంకని ♦ నాఁతిమిన్న, సీత యనుపేరు గలది, యీ ♦ పూతచరిత.

క. ముక్కంటివిల్లు శౌర్యము, నెక్కొన నెక్కిడినయట్టి • నీ కిదివఱకే
దక్కెనయీకోమలి హస్తము, భుక్కసమత్నమున నీయఁ • బూనితిఁ గొనుమా. 57
గీ. రాఘవా! యాలసింప కీ • రాజవదన, పాణి గ్రహియింపుమా నీదు • పాణితోడ
ధరణిఁ దటిదంబుదములచం•దంబుగాఁగ, యుష్మదన్యోన్యసంగమం•బొప్పఁగాత!
గీ. లక్ష్మణ! గ్రహింపుమాయూర్మి • ళాలతాంగి, పాణిఁ గొనుఁడయ్య మీరుమీ • పాణితోడ
మాండవీశ్రుతకీర్తుల • మహితహస్త, తోయజంబుల భరతశ • త్రుఘ్నులార! 59
గీ. దారలుగనిచ్చినాఁడనీ • తలిరుఁబోండ్లఁ, జేకొనుఁడునన్నుఁదరియింపఁ • జేయుఁడయ్య
మీదుబాంధవ్యమునఁ జేసి • మించుఁగాత, మాదువంశంబు లోకైక • మాన్యమగుచు.
వ. అని యిట్లు మహానందంబునఁ బల్కినవాఁడై జనకుండు 61
గీ. తెరనట వధూవరులమధ్యఁ • దెఱవ లిరువు, రతులితానందమునఁ బట్టి • నావసిష్ఠుఁ
డొకవైపు శతానందుఁ • డొకవైపుఁ, జేరియెలుగెత్తి మంత్రముల్ • చెప్పుచుండ.
సీ. మెఱపుఁదీగెంబోలె • మెఱసెడు జానకీ, రాజీవగంధిని • రామునకును
అసమానసౌందర్య • లసమాన యగునూర్మి, ళాసరోజాక్షిని • లక్ష్మణునకు
నిండుచందురుతోడ • సెనవచ్చునెమ్మోము, మురువొప్పు మాండవిన్ • భరతునకును
జేరలఁగొల్వఁగాఁ • జెల్లుకన్నులు గల్గు, శ్రుతకీర్తి నల్ల శ • త్రుఘ్ననకును
గీ. భూసురాశీర్వచనములు • బోరుకలుగ, మంగళధ్వానముల మిన్ను • మాఱుమ్రోఁగ
జనకుఁడందతి కానంద • జనకుఁడగుచు, ధర్మచారిణులుగ నిచ్చి • ధారవోసె. 63
చ. సభమున నప్సరలు • నాట్యముఁ జేసిరి, మ్రోఁగె దేవదుం
దుభులును మింటఁ, గిన్నెరఁ గు • తూహలితన్ గొని దివ్యగానసౌ
రభములఁ జల్లుమాడ్కి మధు • రంబుగఁ బాడిరి కిన్నరాంగనల్
శుభమగుఁ గాక వీరి కను • చున్ మతి దీవెన లిచ్చి రెల్లరున్. 64

లయగ్రాహివృత్తము.

మంగళ మనంగసదృ • శాంగునకు ఘోరసమ • రాంగణజితారికి న • భంగగతి కింకన్
మంగళము కౌతుకత • రంగితున కాఢ్యగుణ • రంగునకు సౌఖ్యకృద • పాంగునకు ధాత్రిన్
మంగళము నిర్జరవ • రాంగముకుటార్చితశు • భాంగున కనంతునకు • మంగళమహాశ్రీ
సంగతున కంచు మదిఁ • బొంగుచును బాడిరి, సు • మంగలులు వేడ్క మెయి • మంగళ
మహార్తుల్. 65
వ. ఇట్లు శుభోత్తరంబుగా జరుగునయ్యుత్సవంబుం జూడ సముత్సుకలై
కౌఁదటలు జలజగంధులు 66

సీ. తమపనుల్ చాలఁబెం ♦ దలకడనే దీర్చి, యత్తయానన చూడ ♦ నరుగువారు
కటిభారమునఁ గుచ ♦ తటిభారమునఁ గూడఁ, బోలేక పోలేక ♦ పోవువారు
పాలీయు మని తమ్మ ♦ బాధించుపిల్లల, నెత్తుకొంచుం బరు ♦ వెత్తువారు
భాజాల విని, చేయు ♦ పనులెల్ల విడనాడి, పర్వుపర్వునఁ జూడఁ ♦ బఱచువారు
గీ. వల్లభునికార్యజాలంబు ♦ లెల్లఁదీర్చి, వార లానందముగ నుండు ♦ వల నెఱింగి
విభుల నాయుత్సవముఁజూడ ♦ వేఁడి పోవు, వార నైరి పురాంగనా ♦ వార మందు.
క. కొందఱు మేడల నెక్కిరి, కొందఱు వాతాయనములఁ ♦ గూర్చుండిరి యే
మందును గిక్కిఱిసిరి యా, చందమునన్ గాంతలెల్ల ♦ సంబరముఁ గనన్. 68
వ. ఆ సమయంబున—— 69
మ. ఒక మంథాచలమధ్య రాముఁ గన నె ♦ ట్లో యెక్కి సౌధంబు, జా
లకముల్ పూర్ణములౌట, వీల్పడమి వ్యా ♦ కొంబంచు నాబోంట్లు పం
చకుఁ జెల్లాచెదరై చనం, బృథుగవా ♦ క్షుం బెక్కి కూర్చుండె, నెం
తకు నేనిం దగుదంచు నెచ్చెలులు చెం ♦ తం జేరి చీ గొట్టఁగన్. 70
మ. వనజాతాక్షి యొకర్తు రాముఁ గనఁబో ♦ వన్ గోర్కితో నత్త యే
మనునో తన్నని గిల్లి యేడ్చె సుతుఁడం ♦ చాడింపఁగా నత్తయా
వనె పోయెన్ సుతుతోడ నచ్చటికి, న ♦ న్నా యింత యారాట మే
లనె యంచుం దనతోడికోడ లది వే ♦ ళాకోళముం జేయఁగన్. 71
శా. సారంగాక్షి యొకర్తు రాముఁ గను ను ♦ త్సాహంబు దీపింపఁ బెం
దారింబోవుచు బింబదృష్టి శుకసం ♦ దష్టోష్ఠియై నెచ్చెలుల్
తా రేకంబయి కేళిసల్పఁ దిరిగెన్ ♦ దంతక్షతంబంచు నె
వ్వా రేమందురో యంచు నింటి కటు దు ♦ ర్వారోరుచింతార్తయై. 72
ఉ. కన్నియ యోర్తు రాముఁ గనఁ ♦ గాఁ జని యాతని మేనియంద మా
యున్నతిఁ జూచి చూచి తల ♦ యూఁచుచు, రూపసీయంచు మెచ్చ నా
సన్నసఖీమణుల్ మిగులఁ ♦ జక్కనివాఁ డని యంటివే కదా
క్రిన్నఁ బెండ్లికమ్మని ప ♦ కాపక నవ్విరి సిగ్గుఁ జెందఁగాన్. 73
శా. కాంతారత్న మొకర్తు గన్పడ గవా ♦ క్షుం బెక్కి, యాలోన ను
త్క్రాంతం బౌమణిఁ గన్గొనన్ స్థలము భ ♦ ద్రింబంచు లేవంగ, నా
చెంతం జేరినకాంత యెక్కుడుఁ, దోలిం ♦ జేసేతఁ బ్రారంభపై
దంతాదంతిఁ గచాకచిన్ జరిగె యు ♦ ద్ధం బంత నవ్వారికిన్." 74

చ. పొలతుక యోర్తు ప్రేమరస ♦ పూరితదృష్టుల రాముఁ జూచుచున్
బులకర మంకురింప, సరి ♦ పొల్తులలో నది కప్పిపుచ్చఁగాఁ
గలికిమిటారులార! హర ♦ కార్ముకభంగ మెదం దలంచినన్
బులకితమయ్యె మే ననుచు ♦ బొంకెఁ జెలుల్ పరిహాస మాడఁగన్. 75

శా. పంకేజాక్షి యొకర్తు రాముఁ గనుచున్ ♦ బాలుండు పాల్ద్రావఁగాఁ
జంకంజేరుట విస్మృతింగని గవా ♦ క్షం బెక్కఁగాఁ బుత్త్రి నే
వంకం గానక యొమ్మ బాదుకొని యే ♦ ద్వంజొచ్చెఁ జేరెల్గినన్
జంకం బూని కుమారు, నూరు వెదుకం ♦ జన్నెయన న్నెచ్చెలుల్. 76

మ. చిగురుంబోఁడి యొకర్తు వొత్తిడిపడం ♦ జే రామి శ్రీరాముఁ గా
నఁగ వేఁటొక్కెడ కేఁగ నెక్కుడుగఁ గా ♦ నన్ వచ్చు నం దంచు నా
మగువల్ వచ్చిరి గుంపుగా నటకు స ♦ మ్మర్దంబుమై నాకె పె
ల్లుగఁ గోపంబుఁ గొనన్ "గతానుగతికో ♦ లోకో" యనం జూపఱుల్. 77

మ. ఒకలంబోదరి ముందుగాఁ బయనమ ♦ య్యున్ రామునిం దోడిపొ
ల్తుక లెల్లం గని రాఁగ, మధ్యపథమం ♦ దుం జూచి, కూర్చుండెఁ, గం
టకజాలావృత మంఘ్రి యంచు నొకచో ♦ టం గుక్షిభారోత్థిత
ప్రకటాయాసపరంపరాభరము డాఁ ♦ పన్ బాష్పపూర్ణాక్షియై. 78

మ. చెలి యొక్కర్తుక వీడునీవి యొకచేఁ, ♦ జేరాడుపయ్యంట నా
వలికేలం గొని, వేళ యయ్యెనని ప ♦ ర్వం గానరాకుండ, వే
నలి చెల్లాచెదరైన, నేదియును మా ♦ నంజాల కాగన్; గరం
బులు రెండే యిడెనంచుఁ గోపమున నం ♦ భోజాసనుం దూరుచున్. 79

గీ. ఒక్క సుందరి సౌధంబు ♦ నెక్కి రాము, సొబగును దదేకదృష్టితోఁ ♦ జూచుచుండ
సరసిజాతాక్షియో లేక ♦ సాలభంజి, కయొ గనుంగొన నది చాలఁ ♦ గష్టమయ్యె. 80

వ. ఇట్లనుకూలదాంపత్యమున కలరుచు నప్పొవుఁబోండ్లు నయనోత్సవంబుగా
నయ్యుత్సవంబుఁ జూచుచుండ 81

గీ. అంత సుముహూర్తమని కొంద ♦ ఱబ్జముఖులఁ, దెరనుదీయంగఁ దత్పర ♦ స్పరవిలోక
నంబులకుఁ బెద్దయంత రా ♦ యంబుగాఁగ, సిగ్గు పెందెర లంతంతఁ ♦ జెన్ను మీఱె. 82

గీ. విభులపదపద్మములఁ దమ్మి ♦ విరులతోడ, నర్చనముఁ జేయుచుండి రో ♦ యనఁగ నంత
సరసిజంబులఁ గేరునా ♦ సతులలోచనములు పతిపాదములయందు ♦ నాట్యమాడె. 83

గీ. భూరిగుణకన్యలైన య ♦ ప్పూవుఁబోండ్లు, తనువిలాసోరుకాసార ♦ తలములందుఁ
గ్రాలుచుండెడుతామర ♦ పూలభంగిఁ, బతులలోచనములను గ ♦ న్పట్టెఁదోడఁగ!

వ. అంత నవ్వసిష్ఠుండును యథావిధిగ నవ్వారిచేఁ బ్రజ్వలితం బగుపావకంబున లాజహోమంబు గావించుతఱి 85

శా. గండాభోగములందుఁ గస్తురి బలెన్, ♦ గర్ణంబులం దుత్పలా
ఖండాలంకృతిమాడ్కిఁ, గాటుకవలెన్ ♦ గందోయియందున్, సము
ద్దండంబై చికురంబులట్లు నొసటన్ ♦ దైవారె నాహవ్యవా
ట్కుండోత్థం బగుధూమ మాచిగురుటా ♦ కుంబోండ్ల కందమ్ముగాన్. 86

వ. ఇట్లు నిగమోక్తప్రకారంబుగాఁ బాణిగ్రహణంబు గావించియున్న యవ్వధూవరుల నాలోకించి యచ్చటివారు, 87

మ. అసమానాకృతి నొప్పువారికి, వికా ♦ రాకార లౌకాంతలన్
బొసగంగూర్చి సురూపకాంతియుతలౌ ♦ పూఁబోండ్లకున్ రూప నీ
రసులం జేర్చినదుర్యశంబుఁ బరిమా ♦ ర్పంబూని, యీధాత యీ
ప్రసవేషూపము లైనరాసుతుల కి ♦ ప్పద్మాక్షులం గూర్చెఁబో! 88

వ. అని యిబ్విధంబుగా ననురూపవధూవరసమాగమముదితాంతరంగులై తమతమయానందంబుల వచోరూపంబున వెల్లడిఁజేయుచుండఁగా నంత 89

ఉ. పెండిలి నాల్గునాళ్లు నటుఁ ♦ బేరిమిమై నివసించి, కండ్లకుం
బండువుగాఁగ వారల వి ♦ వాహవిభుల్ గనుఁగొంచు, గాధిపు
త్రుం డలమైథిలున్, దశర ♦ థున్ ముదమందఁగఁ జేసి, సత్క్రియా
కాండము నంది, వా రనుపఁ ♦ గాఁ జనె నంత హిమాద్రిసీమకున్. 90

గీ. అంత జనకుండు, దశరథుం ♦ డతిశయముగఁ, బరిణయాగతసామంత ♦ ధరణిపతుల
సత్కరించిన వారును ♦ జనిరి యాత్మదేశముల రాముకీర్తిని ♦ దెలుప ననఁగ. 91

వ. ఇట్లెల్లనృపాలురు నాత్మదేశంబుల కేగుడు జనకుండు కొమార్తెలకు బుద్ధులు చెప్పువాఁడై యవ్వారికడ కేతెంచి 92

మ. కులమున్ రూపము గల్గి సర్వసుగుణా ♦ కూపారలౌ భర్తలన్
వెలయం జూచి యొసంగుచే జనకుఁ డు ♦ ర్విం జేయుఁ దా నాత్మజా
తలపట్లం; బయిమాట వారిసుచరి ♦ త్రం; బెట్టు లన్యోన్యమున్
దలలో నాలుకమాడ్కి మీరు మహిళా ♦ ధర్మంబుఁ బాటింతురో. 93

మ. సఖుఁడన్నన్, గురుఁడన్న, దైవమనినన్ ♦ సత్కారమన్నన్, మహా
సుఖమన్నన్, ధనమన్నఁ, బ్రాణమనినన్, ♦ జుట్టంబనన్ శర్వరీ

ణున్ముఖులారా! మఱి పూర్వజన్మసుకృతా ♦ న్యూనావతంసంబనన్
నిఖిలంబున్ నిజజీవితేశ్వరుఁడె పో ♦ నీరేజపత్రేక్షికిన్. 94

సీ. అత్తమామలమాట ♦ కడుగుదాటంగరా, దాఁడుబిడ్డలకు మా ♦ ఱాడరాదు
పతితోడ మాఱొడ్డి ♦ ప్రతివచింపఁగరాదు, దైవపూజల శ్రద్ధ ♦ దప్పరాదు
దాసీజనంబుపై ♦ దయఁ దప్పఁగారాదు, చెలులపైఁ గండ్లెఱ్ఱఁ ♦ జేయరాదు
పనిపాటలందెప్డు ♦ ప్రాలుమాలఁగరాదు, పొరుగిండ్ల కూఱకే ♦ యరుగరాదు

గీ. విభుఁడు దయగలఁడంచు గ ♦ ర్వింపరాదు, విభవ మున్నదియని విఱ్ఱ ♦ వీగరాదు
తనయలార! ధరిత్రి నీ ♦ తనయవైన, యాలిఁ బలుమాటలేల గ ♦ య్యాళియనరె!

గీ. అనుచు నీరీతి జనకుఁడ ♦ య్యాత్మజలకు, బుద్ధులను జెప్పి, నవరత్న ♦ భూరిభూష
ణావళులను, విచిత్రచి ♦ త్రాంబరముల, దాసదాసీజనంబుల ♦ దయనొసంగి. 96

చ. కరుల రథాశ్వజాలములఁ ♦ గాల్బలముల్ నవరత్నభూషణాం
బరముల గోసహస్రమును ♦ బార్థివుఁ డల్లురకున్ ముదంబుతో
నరణ మొసంగి, యాదశర ♦ థావనిజాని బహూకరించి యా
దరమున, సర్వసిద్ధుని య ♦ థావిధి సత్కృతుఁజేయ నంతటన్. 97

క. కొడుకులఁ గోడండ్రను వెం, బడిరా బందుగులతోడ ♦ భామలతోడన్
వడి దశరథుం డయోధ్యకుఁ, గడఁకమెయిన్ వచ్చుచధ్య ♦ కాలమునందున్. 98

సీ. క్రౌంచాచలంబు భే ♦ దించి, మానససరో, మార్గంబుఁ జూపిన ♦ మహితయశుఁడు
కార్తవీర్యుని భుజా ♦ కాంతారమును రూపు, మాపినయట్టి ప్ర ♦ తాపశాలి
రాజులచేతికి ♦ గాజులఁ దొడిగించి, కూర్చుండఁబెట్టిన ♦ గురుబలుండు
కాశ్యపీతల మెల్లఁ ♦ గశ్యపబ్రహ్మకు, దానంబుఁ జేసిన ♦ ధన్యతముఁడు

గీ. రాజకంఠస్రవద్రుధి ♦ రప్రవాహ, దత్తనిజపితృదేవతా ♦ తర్పణుండు
పార్వతీధర్మపుత్త్రుండు ♦ భార్గవుండు, ఘనుఁడు వారల కెదుట సా ♦ క్షాత్కరించె. 100

వ. అప్పుడు

గీ. రూపమునుదాల్చివచ్చిన ♦ కోపమట్లు, ప్రజ్వరిల్లెడు నగ్నిహో ♦ త్రంబుపగిదిఁ
బట్టపగటిదివాకరు ♦ భంగి నున్న, భార్గవుని జూచి యెల్లరు ♦ భయముఁ జెంది.

ఉ. ఎచ్చటనుండి వచ్చెనొకొ ♦ యీతఁడు; వెండియు క్షత్త్రజాతికిన్
జచ్చెడుకాల మేమయిన ♦ సంభవమాయెనొ; యుగ్రుఁడై యిటుల్
వచ్చుట కేమి హేతువని ♦ వారలు లో వెనుకొంచు నర్ఘ్యమున్
దెచ్చిన దానిఁ గైకొనక ♦ తీవ్రత రాముని మ్రోల నిల్వఁగన్. 102

గీ. రాముఁ డంతట భార్గవ ♦ రాముఁ జూచి, వినయగౌరవములతోడ ♦ వినతి సేయఁ
గల్లదండంబులకు నిన్నుఁ ♦ గరుణఁ బూని, విడిచిపుచ్చెద నను మాట ♦ విడుము రామ !

ఉ. వింటి బలోన్నతిన్ శివుని ♦ వింటిని దుంచితివంచు, నేది నా
వింటిని నెక్కువెట్టు మిదె ♦ వీరుఁడ వౌనెడఁ దక్షణంబ, నీ
దంటతనంబు నే నరసె ♦ దన్ రణదీక్షకుఁ బూనువాఁడ, ము
క్కంటికి శిష్యుఁడై యతని ♦ కార్ముకభంగ మెదన్ సహింతునే ? 104

గీ. త్రుక్కువట్టిన శివువిల్లు ♦ దుంచు టొక్క, గౌరవము గాదు, నీ కంత ♦ గర్వమున్న
ఈశరాసంబు వైష్ణవం ♦ బెక్కువెట్టు, మనుచు భార్గవుఁ డన, రాముఁ ♦ డనియె నిట్లు.

ఉ. భార్గవవంశజాతుఁడవు ♦ భర్గునిధర్మసుతుండవున్ దపో
మార్గనివేశితాత్ముఁడవు ♦ మాన్యతముండవు బ్రాహ్మణుండవున్
ఝ్గమదివ్యతేజుఁడవు ♦ దోషవిదూరుఁడ వంచు నే నమో
వగ్గముఁ జేసితిన్ భయము ♦ వల్లను గాదు పరశ్వధాయుధా ! 106

క. ఇదె నాకంఠము భార్గవ ! మది సందియ మెడలి వేయు ♦ మా పరశు వికన్
గదనంబున బ్రాహ్మణులకు, నెదురఁ బరాక్రమముఁ జూప ♦ రిల మావారల్.

గీ. జాతిమాత్రంబుచేత నే ♦ జామదగ్న్య!, మాననీయుండ వైతివి ♦ మాకు నీవు,
మాననీయులతోనైన ♦ మత్సరంబు, అఘముఁ బెంచును గీరితి ♦ నపహరించు. 108

వ. అనియిట్లు వినయంబు బయల్పడఁ బలికిన విని క్రుద్ధుండై పరశురాముఁడు.

చ. ఇరువదియొక్కమాఱు ధర ♦ ణీశులఁ బల్వుర రూపుమాపి, త
చ్ఛిరములతో దివంబునకుఁ ♦ జిత్రతరంబుగ మెట్లుగట్టి సు
స్థిర మగుపూన్కి మాదుపితృ ♦ దేవత లెల్లరు సంతసింప, ను
ర్వర యశ మందు నీపరశు ♦ రాముఁడు బ్రాహ్మణజాతిమాత్రుఁడా ?

గీ. బ్రాహ్మణులతోడ వైరంబు ♦ పాడిగాద, టంచు నీ దుర్బలత వెల్ల ♦ డించి తీవ
బ్రాహ్మణుఁడ యేని మేలెపో ♦ ప్రాణభీతి, గాఁజు దొడిగించుకొన్నట్టి ♦ రాజుకంటె.

గీ. వీర్యముండిన విల్లెక్కు ♦ వెట్టుటొండె, చేతఁగాకున్నఁ గాదని ♦ చెప్పుటొండె
కాని పలుమాటలాడినం ♦ గార్యమేమి ?, లావు గలవారి కియ్యది ♦ లక్షణంబె! 112

గీ. భార్గవుఁడు నీయహంకార ♦ భాషణములు, సైఁచినను నొక్కవేళఁ దా ♦ సైఁచుఁగాక
సైఁచునే మత్తవీరరా ♦ జన్యరాజి, రక్తమాంసాద్మరంబు ప ♦ రశ్వధంబు ? 113

క. అని గర్వంబునఁ బల్కుచుఁ, దన శౌర్యగుణంబుఁ బెక్కు ♦ తడవలఁ దానే
వినుతించుకొనెడు భార్గవుఁ, గనుఁగొని రాముండు పల్కుఁ ♦ గడుఁ గ్రుద్ధుండై.

చ. అలఘుగుణుండవంచు విన • యంబునఁ బల్కినయంత, నీదు దు
ర్బలతను వెల్లడింతువని • పల్కెదె? యిప్పుడె నాప్రతాపపుం
గలిమి యెఱుంగఁ జేసెదను • గాకని, చాపము నెక్కువెట్టి యు
జ్జ్వల మగునొక్క బాణమును • సంధియొనర్చి రఘూద్వహుఁ డనన్. 115

గీ. భూసురుండ వగుటఁ • బూజ్యుండ వైతివి, నిన్నుఁ జంపుశరము • నేను వేయఁ
జాలఁ గాని నీదు • చరణద్వయంబును, ఖండనంబొనర్తుఁ • గాచుకొనుము. 116

వ. అనుచు రాముండు వైష్ణవశరంబుఁ బ్రయోగింపఁబూనుడుఁ బరశురాముండు
జడీభూతవీర్యుండై మెల్లగా నిట్లనియె. 117

చ. క్షితితలమెల్లఁ గశ్యపుని • కిన్ సవనంబున దానమిచ్చునాఁ
డతఁడు మదీయదేశమున • యందు వసింపకుమన్న నే నటే
ప్రతినయొనర్చినాఁడసుమి • ప్రత్యహ మేఁగఁగనా మహేంద్రమున్
నుతచరితా! నికృత్తచర • ణుండయి యేగతిఁ బోదు నే నిఁకన్? 118

క. నాయుత్తమలోకంబుల, నేయు మనఁడు రామచంద్రుఁ • డేసెను; గర్వ
శ్రీ యంతరించి భార్గవుఁ, డాయినవంశజుని జూచి • యప్పు డిట్లనియెన్. 119

ఉ. ఈధను వెక్కువెట్టి నపు • డే నిను సర్వజగచ్ఛరణ్యు నా
మాధవుఁగాఁ దలంచితిని • మానసమందున రాఘవా! జగ
న్నాథుఁడవైన నీకుఁ గద • నంబున నోడిన నాకకీర్తి లే
దీధర నిన్నుఁ బోలఁగలఁ • డెవ్వఁడు బాహుబలైకసంపదన్? 120

సీ. అనుచు శ్లాఘించుతరుణమం • దమరవరులు, కురియఁజేసిరి యతనిపైఁ • గుసుమవృష్టి
రాము దీవించి భార్గవ • రాముఁ డంత, నరిగె నిజవాసమౌ మహేం • ద్రాచలంబు.

గీ. రాము గెల్చినట్టి భార్గవ • రామునోటు, ఘనుచర్యలచేత విని వసి • ష్ఠాదు లప్పుడు
ప్రశంసించిరి రాముని • శౌర్యమునకుఁ, దలఁచెఁ బుత్త్రుఁబునర్జన్మ • దశరథుండు.

చ. అనుపమమంత రాముఁడును, జ • యాంచితుఁడై, భయభక్తు లొప్పఁగా
జనకునకున్ నమస్కృతులు • సల్పెడు నాతఁడు కౌఁగిలించి, వే
గమ్ములను గౌతుకాశ్రువులు • గ్రిల్లఁగ సంతసిలెన్, వసిష్ఠుఁడున్
విజయశిరోయొనర్చి రాముని • వీర్యము వేమఱు మెచ్చుకొంచునున్. 122

మ. శుభముహూర్తంబునను రావణప్రముఖర • క్షోనాథులన్ జంపి మా
కష్టంబులన్ [illegible] శత్రు [illegible] • యంచున్ విషాదన్గులై

యభినందించిరి మింట వేల్పులు, తదీ ♦ యానన్యయుద్ధక్రియా
విభవంబుల్ జయగీతికాకలనతో ♦ వేనోళ్ల శ్లాఘించుచున్. 124

గీ. దశరథేశ్వరుఁ డపు డయో ♦ ధ్యాపురంబుఁ, జేర సేనల కానతిఁ ♦ జేసి రామ
లక్ష్మణాదులు సీతోర్మి ♦ ళాదు లెగు, దేర నెల్లరతో నేగు ♦ దెంచు నపుడు.

సీ. వాతపోతసమీరి ♦ తేత స్తతచ్ఛల, త్కేతనాలంకృత ♦ ద్యోతలంబు
రంగవల్లీముఖ్య ♦ మంగళాలంకార, శృంగారితప్రతి ♦ ప్రాంగణంబు
పాళీభవత్పట ♦ దాళీయుతామ్రప్ర, వాళతోరణవత్ప్ర ♦ తోళికంబు
భూపాలదర్శన ♦ వ్యాపారతృష్ణాప, రాపతత్పౌరఘం ♦ టాపథంబు

గీ. కమ్రఘనసారకస్తూరి ♦ కాసుగంధ, కలితవాఃపూరకీర్ణశృం ♦ గాటకంబు
దూరమందున నే, కను ♦ దోయి యలర, దశరథేశుండు కనె నయో ♦ ధ్యాపురంబు.

ఉ. వాసవసన్నిభుం డతఁడు ♦ వచ్చెడు వేళఁ, బ్రియావలోకనో
ల్లాసముతోఁ దదీయపుర ♦ లక్ష్మి సముజ్జ్వలభూషణాఢ్యయై
భాసిలి దివ్యగంధకుసు ♦ భాసురమందిరయై వెలుంగుచున్
వాసకసజ్జికంబలె నృ ♦ పాలుమనంబు హరించె నెంతయున్. 127

గీ. అత్తటిని మంత్రిదండనా ♦ థాదు లెలమిఁ, గొంతదూరంబు ధారుణీ ♦ కాంతునకును
నెదురుచని గౌరవంబుతో ♦ నెఱఁగి వారు, పురవిశేషితంబులను జెప్పఁ ♦ గరము వినుచు.

గీ. నిజశరీరపతత్ప్రజా ♦ నివహలోచ, నాంబుజంబులచే సహ ♦ స్రాక్షునట్లు
సిరులచే నమరావతీ ♦ కరణి వెలయు, నయ్యయోధ్యఁ బ్రవేశించు ♦ నపుడు రేఁడు.

ఉ. అంబరచుంబులై వెలయు ♦ నట్టి మహోన్నతదివ్యసౌధభా
గంబులనుండి యాధరణి ♦ కాంతునిపైఁ బురకన్యలెల్ల లా
జంబులు సల్లుచుండ, నది ♦ స్వర్గతలంబుననుండి పుష్పవ
ర్షంబులు దివ్యకాంతలు ప ♦ సన్ గురిపించినయట్లు కన్పడెన్. 130

గీ. ఈవిధిగఁ బౌరసత్కార ♦ మెపుమీఱఁ గైకొనుచు, నాత్మజులు నిజాం ♦ గనలతోడ
విపులహర్షంబుతోఁ దన్ను ♦ వెంబడింప, నాత్మగృహముఁ బ్రవేశించె ♦ నవనిజాని.

వ. అప్పుడు తక్కుంగలపౌరులును రాముని గుణగణంబుల కచ్చెరువందుచు
నిజావాసంబులకుఁ జనిరి, యంత రాముఁడు— 132

సీ. ప్రాణంబులను దన ♦ పైననే యిడి తండ్రి, తన్నె లోకంబని ♦ తలఁచుచుండ
దల్లులు గారాబ ♦ ముల్లసిల్లఁగ [illegible] నేర్మితోఁ దమ్ముఁ గని ♦ పెట్టియుండ

అనుకూలవతి యగుచు ♦ ననుదినం బతిభక్తి, నుర్వీతనూజ త ♦ న్నుపచరింప
నీడలంబోలె వెం ♦ టాడుచుం దమ్ములు, గూరిమితోఁ దన్నుఁ ♦ గొలుచుచుండఁ
గీ. దనదునిర్మలసత్ప్రవ ♦ ర్తనలచేతఁ, బౌరజనముల స్వాధీన ♦ పఱుచుకొంచుఁ
దల్లిదండ్రుల కానంద ♦ దాయియగుచు, రాముఁ డుండెను సద్గుణా ♦ రాముఁడనఁగ.

మంజుభాషిణీవృత్తము.

సరసీజబంధుకుల ♦ చారుభూషణా !
పురుహూతవంద్య ! స్మిత ♦ పూర్వభాషణా !
సరసాంతరంగ, ముని ♦ సన్నుతా ! సుధీ
పరిపాలనాభ్యుదయ ♦ బద్ధకంకణా !

సుగంధివృత్తము.

సర్వలోకకీర్త్యమాన ♦ సద్గుణా ! సువ్యాద్గుణా !
శర్వముఖ్య సర్వదేవ ♦ సన్నుతా ! జగన్నుతా !
పర్వదాత్మగర్వదైత్య ♦ భంజనా ! నిరంజనా !
ఊర్వరోపసాలవద్బ ♦ లోదయా ! మహోదయా ! 185

శాలినీవృత్తము.

మారాకారా ! లోక ♦ మాన్యావతారా !
తారాధీశాపార ♦ దర్పాపహారా !
హారాద్యాలంకార ! ♦ హార్యత్రుసారా !
సారాచారా ! భూమి ♦ జాచిత్తహారా !

ఇది శ్రీ కాశ్యపగోత్ర జగన్నాథాచార్యపుత్త్ర పక్కి పూర్ణప్రజ్ఞ కవి
విరచితం బగు శ్రీరామకళ్యాణంబునందుఁ బంచమాశ్వాసంబు
సర్వము సంపూర్ణము.
శ్రీ సీతారామచంద్రపరబ్రహ్మార్పణ మస్తు.





Printed at the Chandrika Press, Guntur.